# దంపతులు

[రెండంకాల నాటకం]



కర్త
ఫో. వెం. రంగారావ్

ప్రకాశకులు
అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారు
సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము
1931



[వెల 1—0—0

*
* *

H ! Love If thou and I were with fate to conspire
To change this sorrow scheme of thing, entire
Would we not shatter it to bits and then
Remould it heaven to the Heart's desire.

* *
*

# పాత్రల సమష్టి

| | | |
|---|---|---|
| భట్టుమూర్తి | — | లా కాలేజీ విద్యార్థి |
| నరసింహం | — | అతని సహపాఠి |
| డాక్టరు రామమూర్తి | — | వైద్యుడు - ఇంకో వృత్తి పెళ్లిళ్లు కుదర్చడం |
| జగన్మోహను | — | మూర్తి స్నేహితుడు - ఇంగ్లండులో విద్య |
| కమలమ్మ | — | మూర్తి భార్య |
| శేషమ్మ | — | నరసింహం భార్య |
| నారాయణరావు | — | హోటలు నౌకరు |

బీచి షికారు మనుష్యులు, నౌకరు.

## కాలం — ప్రస్తుతం

మొదటి అంకానికి రెండో అంకానికి అయిదు సంవత్సరాలు.

## స్థలం — మొదటి అంకం

సీను i లా కాలేజి సింహద్వారం

ii కోమలవిలాస్ కాఫీహోటలు

iii బీచి

iv భట్టుమూర్తి యిల్లు.

## రెండవ అంకం

సీను i బీచి

ii భట్టుమూర్తి యిల్లు

iii నరసింహం యిల్లు

vi భట్టుమూర్తి యిల్లు.

ప్రాజ్య పాశ్చాత్య దేశాల ప్రతిభగాంచి
నాటకాలను ప్రీతి విన్నాణమొసగ
రచనజేసిన ఇబ్సెను పూజ్యచరితు
మదిఁదలంతును భావసమ్మతము గోరి.

# దంపతులు

## అంకము 1

### సీను i

(లా కాలేజి సింహద్వారమువద్ద, పోర్టికో రెండువైపులనుండి భవనంలోనికి రాతి కట్టడపు మెట్లు. వెనుక భవనంమధ్య తోట ఆవరణ, పూలచెట్లు క్రోటనులనడుమ జలయంత్రం (fountain) అచ్చట భట్టుమూర్తి, నరసింహం నిలచి యుందురు. భట్టుమూర్తి పొడుగరి, పచ్చనిరంగు, ఆదర్శపురుషుని కనులు, సూటుధరించి యుండును. నరసింహం చామనచాయ, గ్లాసుకోమల్లు సైకిలుకట్టు, నీలిసెర్జి కోటు, టై, ఆకుజోడు.)

భ—(చక్కని వెండిసిగరెట్టుకేసును కోటు కుడివైపు క్రిందిజేబునుండి తీసి, దానిని తెరచి స్నేహితునివంక చేయిజాచి) సిగరెట్.

(నరసింహం పుచ్చుకొనును. భట్టుమూర్తి ఒక సిగరెట్టును తీసుకొని అగ్గిపుల్లను వెలిగించి, మొదట నరసింహానికి యిచ్చును. ఆపుల్లతోనే తాను వెలిగించును.)

న—ఈ సిగరెట్లు కాల్చడానికి, యింతదూరం కాలేజికి రావడమెందుకు. యింటిదగ్గర హాయిగా పేకాట వేసుకోకుండా.

భ—యిక్కడ యెటెండెన్సు యివ్వడానికి కొందరైనా రావాలా కాలేజి తెరచి మూడు మాసాలైంది. నేను రావడం నాలుగో సారి. నిన్న సుబ్బయ్య మాయింటికి టెన్నిసు ఆడ్డానికి వచ్చి, ఎప్పుడు యితర్లకు ప్రాక్సీయెటెండెన్సు యివ్వడం కోసం తాను

ప్రతిదినం కాలేజికి వెళ్లాలిసి వస్తుందని, తనకేమి విశ్రాంతి లేదని గోల పెట్టాడు. పరోపకారార్థం ఎటసిటరా అని చెప్పి ఊరడించాను.

న—నీసదభిప్రాయం సూచించడానికి కాబోలు ఈవేళ కాలేజిని అలంకరించావు.

భ—కాని వాడు రోజువస్తే నేమిలే. యింట్లో నిద్రపోవడం బదులు, వెనకబెంచీల మీద గుర్రుపెడతాడు.

న—పాపం వాడు భార్యపిల్లల యెడపాటుచే తపించి పోతున్నాడు. కాని యెడబాటువల్ల ప్రేమ విజృంభిస్తుంది. అది మనకవుల వర్ణనల బట్టి తేలుతుంది.

భ—ఈ బొమ్మలపెళ్లి భార్యాభర్తలకు ఆలాంటి అనురాగం ఎక్కడినుంచొస్తుంది. స్త్రీపురుషుల అనురాగం అంటే యేమిటో సరిగా మన కవులకు గూడ తెలియదు.

న—మనదేశంలో సుఖంగా కాలక్షేపం జేసే దంపతులు వేనవేలున్నారు. దాన్నిబట్టే మన సంఘాచారం దైవికమని చెప్పగలను.

భ—సుఖము! సుఖము! మనుష్యుని జీవితానికి సుఖమాదర్శం. మాదొడ్లో ఉన్న ఆవులు సుఖంగా లేవూ! పందెపుగుర్రాలంతకంటె సుఖంగా వుంటాయి. ఈ సుఖంగూడా చాలామంది దంపతుల కుందని నమ్మను.

న—చూడు యింగ్లండులో ప్రతిదినం జరిగే విడాకుల కేసుల సంఖ్య పెరుగుతూవుంది. వాళ్ల వివాహ జీవితపుసారం దాన్నిబట్టి తెలుస్తుంది.

భ—అదిగూడా స్వేచ్ఛాసూచకమే. అనురాగం తప్పిన దంపతులు విడిపోవడమే శ్రేయస్కరం. మనలో అనురాగంతో ప్రారంభం కాదు. విడిపోడాని కవసరమే లేదు. వివాహానికి ప్రేమతో నిమి

త్తం లేదు. ఈడుజోడు చూడకుండా పెళ్లి చెయ్యడం దేశాచార మయినపుడు యిక తిరుగుబాటు ఎక్కడినుంచి వస్తుంది.

న—నీవన్నీ విపరీతపు తలపులు. మన తలిదండ్రులు సుఖంగా పవిత్ర జీవితాన్ని గడపలేదా. ఈకష్టపు జీవితంలో అంతకంటే కోరదగిన దేమిటి.

భ—మన వాదన దారి తప్పిపోతుంది. జీవితం విచారసాగరం అంటే నేను మరి మాటాడలేను. జీవితం ఉత్కృష్టమని, అద్భుతమని నమ్మటయే నామనస్సు పునాదికి మొదటిరాయి. అందుపై మనో భవనాన్ని నిర్మించాలి.

న—యివన్ని అనుభవంలేని మాటలు. నువ్వు పెళ్లిచేసు కున్నపుడు ఈ ఊహాలన్ని యేమవుతాయో చూస్తాంగదూ.

భ—నేనొకవేళ యింద్రియనిగ్రహం లేక మెత్తపడి, పాతబురద దారిలో పడినప్పటికి, నా నమ్మకం ఎంతమాత్రం చలించదు. ఏమో మన శృంగారకావ్యాలు ప్రబంధాలు చదువుతుంటే తమా షాగానే వుంటుంది. కాని వాటిలో గొప్పలోపం ఉన్నట్టు నాఅంత రాత్మ బోధిస్తుంటుంది. ఆ భావాలు చాలా తక్కువజాతివైనట్టు అంతకంటె విపరీతంగా పవిత్రం అయిన భావం మానవ మనో నిర్మాణంలో యిమిడి ఉన్నట్టున్ను, అది మన కవులు గ్రంథకర్తలు గ్రహించ లేదనిన్ని నాకు మాటిమాటికి తోస్తూ ఉంటుంది.

న—మన దేశంలో మాత్రం గొప్ప వాంగ్మయం లేదా. కాళిదాసు శాకుంతలను చదివి డంగయిపోవని పాశ్చాత్యపండితు డున్నాడా. అట్టి కవులకు నీవూహించిన భావం స్ఫురించలేదా.

భ—సంస్కృత వాంగ్మయం రసవంతమైందే. కాని ఆ గ్రంథాలు మన దేశపు భాషలలోకి తర్జుమాచేసి, ప్రతికవి ఆభావాల్నే అటుతిప్పి యిటుతిప్పి ప్రతి పుస్తకంలో యిమిడ్చి విసుకుపుట్టించేశారు.

తర్జుమా చేసిన వాళ్లు మహాకవులమని పిల్చుకుంటూన్నారు. తర్జుమాదారు ఒక కవి వ్యాయామశాస్త్రం అచ్చుశాస్త్రం పద్యాల్లో వ్రాసినవారు మరికొందరు కవులు. అందరు కవులే, అందరు రాజులే.

న—కొందరు కవిరాజులు. హేళనచెయ్యడంకంటె విమర్శనజేసి దురభిప్రాయాలు తొలగించ కూడదా! ఆవిధంగా నయినా దేశానికి కొంతసేవ చెయ్యొచ్చును.

భట్టు—చదువు ముగించింతరువాత దేశసేవగురించి ఆలోచిద్దాంలే. నాకున్న చిక్కేమిటంటే సంఘాన్ని మార్చకుండా, జీవితదృష్టిపథాన్ని విశాల పరచకుండా, ఏమీ చెయ్యలేము. మనగ్రంథకర్తలకు అట్టిభావాలు స్ఫురించక పోవడానికి కారణమేమిటి? మన పరిస్థితులే. కల్మషంతో నిండినయింట్లో ఎన్నిసారులు స్నానం చేసినా, ఎన్నిమడులు కట్టుకున్నా తిరిగి ఆకల్మషంలోపడి కొట్టుకోవలిసిందే. మనస్సుకు వికాసంకోరితే పరిస్థితులు మార్చివేయాలి. పూర్తిగామార్చివేయాలి.

నర—ఏమిటి! చాలాసీరియస్ అయిపోతున్నావు. యిదేమికాంగ్రెస్ ప్లాటుఫారమ్ అనుకుంటున్నావా మాస్టర్లు లెక్చర్లువినడం బదులు, నీమాటలు వింటే కాలేజికుర్రాళ్లకి కొంచెం వినోదంగా నయినా ఉంటుంది ఈమాస్టర్లపని మా బాగుంది. వాళ్లు చెప్పేది ఎవరూ వినరు గనుక, ప్రయాసంలేనిపని. అదిగాక రోజుకొకగంటే.

భ—కొత్తగా ప్లీడరి ప్రారంభించినవారికి యిదొక జీవనోపాధి. యిక నేర్చుకోవడమా. యితరకాలేజీలు మాబాగున్నాయా. ఈ చదువంతా జీవనోపాధికి మార్గమే. గుమాస్తాపనికి మంచితరిఫీదు.

న—చదువు ముగించేసరికి పెళ్ళాం పిల్లలు నెత్తిమీద కూచుంటారు. అంచేత దీర్ఘాలోచన లేకుండా చేతచిక్కినపనిలో ప్రవేశించడమే.

నీ వివాహం మాటేమిటి. చాలా సంబంధాలొస్తున్నాయట.

భ—అవును వివాహపు మార్కెటులో నన్ను చాలా విలువైన వస్తువుగా చూపిస్తున్నారు. రోజూయెవరోవచ్చి బాధపెడుతునేఉంటారు. నన్నడిగితే మా నాన్నగారిని అడగమంటూ. ఆయన్నడిగితే నన్నడగ మంటారు. ఒకొక్కప్పుడు వాళ్లని ఏడిపిస్తుంటానుగాని, పూర్ డెవిల్స్, వాళ్ళని చూస్తే కనికరం వేస్తుంది.

న—మీనాన్న ఏమి కలుగజేసికోపోవడానికి కారణం ఏమిటి.

భ—అదొకకథ. నోకవరంలో ఒక లోభిఉన్నాడు. అతనికి ఒకర్తే కూతురు. కట్నం ఎంతైనా యిస్తామన్నారు. కాని పిల్లమాత్రం యీ రంగు (అతని కోటువైపుచూపును.)

న—అయితేనేం.

భ—యితర విశేషాలుగూడ ఉన్నాయి. మాయింటికప్పట్లోవచ్చారు. దూరపు బంధువు లనుకుంటూ.

న—ఆవిడను ఈవిధంగా డిఫేము చెయ్యడం—

భ—పెళ్ళి అయిపోయిందిలే. వాళ్లిద్దరును సుఖదంపతుల సమూహంలో చేరారు.

న—ఆవిడను చేసుకోక పోవడానికి ఏమి సమాధానం యిచ్చావు మీ నాన్నగారికి.

భ—సమాధానం—ఒకమాటే చెప్పాను. మనపరిస్థితుల్లో వివాహం అయిన తరువాతగదా దంపతులప్రేమ పరీక్షవుతుంది. అంచేత సౌందర్యంఅన్నా స్త్రీకి ఉంటే కొంతజమతో గృహస్థాశ్రమం ప్రవేశించవచ్చని మానాన్నగారిని వప్పించాను.

న—మీనాన్న—అతను సరసుడే.కుమారుని సౌందర్యపూజ గ్రహించి మావాడు చదువు ముగిస్తేనేగాని పెళ్లిమాట తలపెట్ట నన్నాడండి. తరవాత ఆలోచిద్దాం అన్నాడు.

భ—బాగా పూర్తిచేసేవు. వాళ్ళు యితనికోసం కాచుకున్నాచుంటే రెండికిచెడ్డ రేవడవుతందని, నెక్స్టు బెస్టుకిచ్చి ముడివేసేశారు. మన రెక్కలు స్వేచ్ఛగానే ఉన్నాయి.

న—అప్పట్లో నీహృదయం యింకొకచోట వాలింది కాబోలు.

భ—రోజుకొకచోట వాలుతుంటుంది. అది నిముషమాత్రమే. నతింగ్ సీరియస్. కాని నిన్న ఎలిఫిన్సటన్‌లో హావేయియస్— స్ప్లెండిడ్ (Splendid) ఆ నృత్యం ఆ గానం. ఆ రెండుగంటలు నిర్ఘాంతపోయి చలించకుండా కూచున్నాను. అందులో ఒక బెదరిన లేడి చూపుల కోమలాంగి నా హృదయాన్ని—

న—ఏమిటిది. కవిత్వధోరణిలో పడుతున్నావు.

భ—అట్టి అనుభవాలే భావాన్ని దీపింపజేస్తాయి. వాంఛలు సానపెట్టినట్టయి, అగ్నిజ్వాలలాగు ప్రకాశిస్తాయి. ఆవిడతో మాట్లాడడానికయినా మన కవకాశంలేదు. కాని పిల్లమాత్రం రాజువేపు చూడగూడదా. రేపు మళ్ళా ప్రోగ్రాం మారుస్తున్నారు. నీవు గూడ రా.

న—యిపుడు కొంచెం ఖజనా చిక్కులు.

భ—అది ఎపుడు ఉండేరోగమే. క్రానిక్ (Chronic) అయితేనేం సర్దుబాటుచేదాంలే. డన్ (Done) ఎనిమిదిన్నరకే థియేటరుకు వచ్చేయి.

(తెరవెనుక గంట వెనుకనుంచి గునగునలు, చప్పుడు విద్యార్థులు వచ్చుచున్నారు.)

న—అదిగోగంట ఫలహారపుకాలం. యీమూక మనలో చేరకమునుపే కోమల విలాస్‌కు పోదాంరా.

(వారు నిష్క్రమించుచుండగా తెర)

సీను ii

(కోమలవిలాస్ కాఫీహోటల్, హాఫునఫ్లార్స్సు, ఒకగది. వెనుక ఎడమచేయివేపుద్వారం. ఆపక్కను ఒక చిన్నబల్లవద్ద ఒక ముసలివాడు లాల్జీపంచతో కూచుని యుండును. ఎడమగోడవేపు అద్దపుబీరువాలో ఫలహారములు, ఆపక్క బల్లపై గ్లాసులు, కప్పులు, సాసర్లు గదిమధ్య రెండు మార్బిల్ కప్పుగల బల్లలు, యిరువంకల కుర్చీలు, ఎడమగోడవంక చిన్నబల్లపై సీటిడబ్బా.

ముందునుండి భట్టుమూర్తి నరసింహం ప్రవేశించి చేతులు డబ్బావద్ద కడుగుకొని, ఒకసారి అద్దములో ముఖావలోకనము గావించి, ముందు బల్లవద్ద యిరుప్రక్కల కుర్చీలపై కూరుచుందురు. వెనుక మరియిద్దరు మనుష్యులు కూచొని ఫలహారములు తినుచుందురు. మలయాలీ నౌఖరు చిన్నగుడ్డను మాత్రము మొలకుకట్టుకొని, గుడ్డతో బల్లలను తుడుచుచుండును.)

న—(నాయరు గుడ్డపట్టుకుని తమ బల్లవద్దకు రాగా) నాయర్! మాబల్ల తరువాత తుడవచ్చును. ఆ గుడ్డమాత్రం యిటు తీసుకు రావద్దు. ప్రతినిముషం లోమనులో కడిగినా శుభ్రపడదు.

భ—చెడ్డవస్తువులే నాదృష్టిపథంలోకి వస్తాయి. వాటిని తలపెట్టక పోతే మనసేమీ బాధించవు. నారాయణరావు (అని పిలుచును) (వెనుక సన్నని చౌకాకు, క్రాపింగుతల, గూడకట్టుతో, వెనుక బల్ల దగ్గర ఉన్నవారికి ఏదో అందించుచుండును. సార్ అనును. మాగడునువాడోయి. ఎవర్ని ఎలాగు సంతోషపరచాలో బాగా తెలుసును.

న—అందులో నువ్వంటే హోటలు వెయిటర్లు నడుం కట్టుకొని నవరిస్తారు. నీ రుచులన్నీ బాగా తెలుసు. నీడబ్బురుచి మరీబాగా.

భ—ఎప్పుడు డబ్బుగొడవేనా మనకు లేం పదొక్కటే. (యింతలో నారాయణరావు వెనుకనుండి వచ్చి అణకువగా నిలుచును. అతనిని ఉద్దేశించి) ఏమిటి ఈవేళ స్పెషల్ (Special)

నా—కాల్కటారసగుల్లా, బాదాంపూరీ, స్వీటు, లెమనుకిచడి సేవరీ.

భ—ఏమి పేర్లు, ఏమి పేర్లు. మీా మేనేజరు ఈపేర్లు ఎక్కడ సంపాదిస్తాడో అతను గూడా ఒక కవి అయియుండాలి సృష్టిస్తాడు. సరే ఏమంటావు నరసింహం.

న—నీకేదిష్టమో నాకూ అదే.

భ—స్వీటు ఆరసగుల్లా. కాని సేవరీ. ఈసేవరీ పెద్దసమస్య. ఎప్పుడు కిచ్చిడీలే బాతులే ఒక విధమైన పేస్టు రంగువేసిన ఉప్మా అంతే.

నా—మీాకు ఏసేవరీ పట్టదండి. వంగాయదోసె వేయించేదా లెకపోతే పూరీ ఉరలగడ్డలా.

భ—మొదట రసగుల్లా తీసుకురా అది లోనికివెళ్లి ఊహాకు సహాయం జేస్తుంది.

(నారాయణరావు చిఱునవ్వుతో పోవును)

న—చదువులు ఉద్యోగాలు అని దేవుళ్లాడ్డం కంటె, ఒక కాఫీహూటల్ పెట్టుకుంటే యిక ముందాలోచన అక్కర్లేదు. ఆకిష్ణయ్యరు చూడు. పదేళ్లలో ఆరులక్షలు సంపాదించాడు. సాయంకాలము వాడికొడుకు కోడలు, బ్యాంకిసీడను కార్లో బీచి షికారు.

భ—మొదటిది కాఫీహూటలు పెట్టడాని కయినా కొంతడబ్బుండాలి. అది మనకు లేదు. రెండు మనిషి డబ్బువల్లనే జీవించడు.

న—"ధనము లేకున్న బ్రతుకు వ్యర్థమ్ము సుమ్ము."

భ—ధనం కొంతశక్తి నివ్వవచ్చు. ఆశక్తిని వాడుక చెయ్యడంలో ఉంది. ధనం సంపాదించినంత మాత్రాన ఆశక్తి రాదు.

(వెనుక ద్వారమునుండి డాక్టరు రామమూర్తి ప్రవేశించును.

లాంగుకోటు, తలపాగ, బిళ్లగోచిపోసి కట్టిన ధోవతి, చేతిలో విక్రృత మగు కర్ర, తెల్ల కేన్వాసు జోళ్లు.)

న—ఆమనిషిని నాకు వ్యక్తిత్వాన్ని సూచించే వేషం.

భ—(కొంచెము పక్కకు తిరిగి రామమూర్తివైపు చూచును. అసంతుష్టి సూచకమగు గొంతుతో) యిదేమిటి ఈడచ్చా వచ్చాడు. అతనొక వివాహాల ఏజెంటు. స్వరాజ్యప్రభుత్వంలో మంత్రిపని బాగా చెలాయించ గలడు. ఈ చెడ్డ బేరంలోనుంచి ఏదో విధంగా పైకి రావాలి. (యింతలో వెతుకుకొనుచు రామమూర్తి వారిని సమీపించును. భట్టుమూర్తి లేచి సగౌరవముగా) గుడ్ మార్నింగ్ డాక్టర్. చాలాకాలానికి మీా దర్శనం, దయచేయండి.

(అందరూ కూరుచుందురు.)

ఈ కాఫీహోటళ్ల మూలంగా మన సంఘజీవనం మారుతూ ఉంది. స్నేహితులని కలిసుకోవచ్చు, ప్రస్తుతసమస్యలను చర్చించవచ్చు. క్షమించండి. (నరసింహంవంకజూపి) నరసింహంగారు మాసహోధ్యాయి. డాక్టరు రామమూర్తిగారు వైద్యులు. ఈయనికి తెలియని వాళ్లు ఈ వూళ్ళోలేరు.

(నరసింహం డాక్టర్లు చిరునవ్వులతో నమస్కరింతురు.)

డా—భట్టుమూర్తిగారు మిమ్మల్ని కలుసుకోవాలని యెన్ని ప్రయత్నాలు చేశానండీ! మీాయింటికి వెళితే టెన్నిసుకు వెళ్ళారనో, నాటకానికి వెళ్ళారనో ఎక్కడికి వెళ్ళారో మాకు తెలియదనో చెప్పే వారు. కాలేజికి వెళితే ఆయనెప్పుడు కాలేజికిరారు. క్లబ్బులో బిలియర్డ్సు ఆడుతుంటారని చెప్పేవారు. ఈవేళ ఉదయం మీా స్నేహితుడు సుబ్బయ్యగారు కనపడి ఎక్కడలేకపోయినా, టిఫిని వేళకు కోమలవిలాస్ హావుసాఫ్ లార్డ్సును తప్పదని చెప్పారు.

భ—చూచారా లెజిస్లేటివు కవున్సిలుకంటె కాఫీహోటళ్ళు సంఘా

నికి చేసే ఉపకారం. కాని నన్నింత ఉత్సాహంగా వెంటాడ్డాని కేదో విశేషం ఉండాలి.

డా—ఏముంది. మీ తండ్రిగారికి నాకు ఎంతస్నేహం. మీ తాత గారు మావూళ్లో—

భ—ఈ మనవంశవృత్తాంతాల అల్లిబిల్లిక లేంగాని.

(నారాయణరావు ఫలహారం తెచ్చి బల్లపై నుంచును. డాక్టరు వంకకు భట్టుమూర్తి తనప్లేటుతోసి) మరియొకప్లేటు తీసుకురా. పుచ్చుకోండి డాక్టరుగారు విశేషంఏమిటో చెప్పారుగారు.

న—విశేషం కొంత గ్రహించినట్టున్నావు. ఏమిటా ఆతృత.

డా—(కొంచెంసందేహంతో) కాదండీ—నిజంగా—మిమ్మల ని చూద్దాం (నరసింహంవంకజూచును.)

భ—సందేహం అక్కర్లేదు. నరసింహం మనలోవాడే. నాప్రియ మిత్రుడు. పెళ్ళికూడా అయిపోయింది.

డా—మీ కంతా హేళనగానే ఉంటుంది. వైభవంగా పెళ్ళిచేసుకొని ఉద్యోగాలుచేస్తే మాలాంటివాళ్లంచూసి సంతోషిస్తాం.

(నారాయణరావు ఫలహారము తెచ్చిపెట్టును)

భ—నేవరీ నాకేమివద్దు. కాఫీతీసుకురా. మీరో.

(డాక్టరువంక నరసింహంవంక చూచును.)

డాక్టరు నరసింహంలు—మాకులంతే.

(నారాయణరావు పోవును.)

భ—ఏమంటున్నావు—ఆ—పెళ్ళి—అవును ఎవరికి యిష్టమైన వస్తువును వారు కోరడం స్వాభావికమే. కాని ఈవిధంగా తల్లిదండ్రులు, స్నేహితులు, బంధువులు, పిల్లల నివ్వడానికి సిద్ధంగా ఉన్న వాళ్లు, వివాహంకాని యువకులని బాధించడం ఎందుకు. ఆకలి వేసినప్పుడే ఆహారంరుచి. స్త్రీవాంఛ కలిగిం తరవాతే పెళ్ళి తలపెట్టాలి.

డా—స్త్రీవాంఛ లేనివాళ్ళేవరున్నారు. అనిగ్రహించే మనపూర్వులు ఆవాంఛ కలిగేసరికి మనస్సు యితరచోట్లకి పోకుండా వివాహం మూలంగా కట్టిపెట్టమన్నారు.

భ—అయితే వివాహం అయినంత మాత్రాన మనస్సు యిన్నా రయి, యితరచోట్లకు పోదన్నమాట. యిది అనుభవవేద్యమా.

డా—ఎప్పుడైనా పోతేనేమిలెండి. తిరిగి శాశ్వతమైన భార్యవంక మరలి వస్తుంది.

భ—చిరకాల పరిచయంవల్ల అట్టి సంబంధం ఏర్పడుతుంది కాబోలు.

(నారాయణరావు కాఫీ తెచ్చియిచ్చును. అందరు కాఫీ పుచ్చు కొనుచు మాటాడుదురు)

న—డాక్టరుగారు వచ్చినపని చెప్పక పోవడానికి కారణం నేను గాబోలు. నేను వెళతా.

డా—అబ్బె కూచోండి. మీకుపూర్వసాంప్రదాయా లంటే కొంత గౌరవం ఉన్నట్టుంది. మీసలహా అయినా పుచ్చుకుంటారు.

న—సలహా తరువాత పుచ్చుకోవచ్చు. అదీగాక నాకు కాలేజిలో కొంచెంపని ఉంది సెలవు.

భ—సరే. రేపు ఎలిఫిన్స్టన్ వద్ద ఎనిమిదిన్నరగంటలకు గుడ్ మార్నింగ్.

(నరసింహంలేచి వచ్చినదారినిపోవును.)

డా—ఈవిషయంలో మీకు నూతన అభిప్రాయం ఉన్నట్టు యిదివ రకే విన్నాను. కాని నా అనుభవాన్నిబట్టి సరియైన సంబంధం వస్తే ఆయనమాత్రం అంగీకరించడా. అన్ని అంగములు సరిలేక నిరసన భావం లోగడ చూపించి ఉంటారని మనస్సు సమాధాన పరచుకొని మిమ్ములను వప్పించే దృఢసంకల్పంతో వచ్చాను.

భ—సంకల్పమేగదా సృష్టికిమూలం. నేను అభిప్రాయం కొంత

మార్చుకుంటున్నాను. సెలిబేటుగా పెళ్ళిచేసుకోకుండా ఉందామని లోగడనిశ్చయించాను. కాని మనిషియొక్క జీవితం సమానాదర్శములుగల మరియొకవ్యక్తితో మేళవిస్తేతప్ప వికసించదు. పురుషులతో స్నేహంవల్ల. స్త్రీఅయితే ప్రేమవల్ల. అట్టిప్రేమ సంబంధమే సంఘంలో వివాహంగా పరిణమించాలి.

డా—మీ అభిప్రాయం చాలా బాగుంది. అందువల్లే వివాహం అయినతరువాత దంపతులు విధిగా ప్రేమించాలి.

భ—అది బండిముందు గుర్రంవెనకాల అవుతుంది. పూర్వము స్కాట్లాండులో కొందరు ప్రభువులు ఎవరైనా నరహత్య చేసేరని తెలిస్తే వాళ్ళని ముందుగా ఉరితీయించి తరవాత కేసువిచారణ చేసేవారట.

డా—బాగు! బాగు! కాని ఈసంబంధం అన్నివిధాల బంగారం వంటిది. మూడువేలు కట్నం. కొంతభూమిగూడ పిల్లకు వ్రాసియిస్తారు.

భ—కట్నం పుచ్చుకోడంకంటె మూర్ఖం మరొకటి లేదు. పెళ్ళిని సంస్కారమని పెద్దపేరుతో పిలవడం బదులు, కూరగాయలబేరం అంటే బాగుంటుంది. కాని కట్నాలు యివ్వడం వల్ల తండ్రులు గుల్లయిపోతున్నారన్నమాట నమ్మను. కూమాళ్ల విషయమై వేనవేలు ఖర్చుచేస్తారు. ఎంతమూర్ఖుడేనా సరేకాని కుమార్తెకు ఒకవెయ్యో రెండువేలో యిచ్చేసరికి కొంపమునిగినట్టు ఆలోచిస్తారు. పత్రికలలో పెద్దవ్యాసాలు. పెళ్ళి అయ్యేవరకు యింట్లో దాసీపనిగూడ చేయిస్తారు. పెట్టేభోజనం కూలి కిటుతుంది. యిదంతా స్త్రీలు దాస్యస్థానంలో ఉండడంవల్ల.

డా—ఏమండి, స్త్రీ గృహలక్ష్మిగదా ప్రతియింట గృహ వ్యవహారాల్లో యజమాని భార్యయేగదా.

భ—భార్యలేని యింట్లో మీరు నౌఖరును పెట్టుకుంటే వాడికి ఉంటుంది అంత అధికారం.

డా—అయితే స్త్రీకి ఆస్తి ఉండడం శ్రేయస్కరమేగదా.

భ—తప్పక. అదియే ఆత్మగౌరవానికి మొదటిసోపానం. అందుకే తండ్రులు తమస్థితినిబట్టి కుమార్తెలకు ధనమియ్యాలి. వరుడు పుచ్చుకోడం నీచమైనపని.

డా—సరే. మీరు కివ్వదలచిన డబ్బు ఆమెకే యివ్వవచ్చు. అలా గయితే మీ కిష్టమేనా ?

భ—నా యిష్టమేమిటి. ఏదో లోకవిషయం మాటాడేం గాని నా విషయం ఏమిటి ?

డా—మళ్ళీ మొదలుకు వచ్చారు. మీ నాన్నగారితో యీ విషయం మాటాడేను. ఈసంబంధం బాగా నచ్చింది. వారిది విజయనగరం. ఆయనకు కోటలో ఉద్యోగం. పిల్ల రూపసి. పదహారేళ్లుంటాయి. ఫొటోగ్రాఫు గూడ తెచ్చాను. అది మీకు నచ్చితే మిగిలిన యేర్పాటంతా నేను చేస్తాను.

భ—నన్ను చక్కగా బుట్టలో వేస్తున్నారే. స్వతంత్రంగా పెళ్ళికి ముందు స్త్రీ పురుషులు కలుసుకొననివ్వ, ప్రేమించనిద—

డా—అది మన సంఘంలో లేనివిషయం. పిల్లను చూడ్డానికయినా వీలులేదే.

భ—ఫొటో చూడవచ్చా ? ఏది అయినా చూదాం. (డాక్టరు తన జేబులోని ఫొటో తీసియిచ్చును. భట్టుమూర్తి తేరిచూచును. మెల్లగా) చాలా చక్కనిదే. అంటే ఫొటోను విజ్ఞానపుదృష్టితో చూస్తే నాగరిక తాచిహ్నలేమీ కనపడవు.

డా—(భట్టుమూర్తిలో కొంతమార్పు కలుగుటను గ్రహించి) నాగరికత కేమిలెండి. కొద్దిరోజులు చెన్నపట్నంలో వుంటే అందులో

మీా సాంగత్యం.

భ—అయినా ఆమెను ఒకసారి నిజరూపంలో చూడాలి. అప్పు డాలోచించి చెపుతాను. యిది ఒడంబడికగా గ్రహించగూడదు. చూచినతరువాత యిష్టమయితే.

డా—మనలో అది యెలా కుదురుతుంది. తీరా మీారు చూచింతరు వాత, అంగీకరించకపోతే—ఏమవుతు.

భ—జీవితం అంతా అపాయాలతో నిండిఉంది. వాటిని తప్పించు కోడమే జీవితానికి ముఖ్యమైన ఆనందం. నేనుకోరింది అంత కఠిన మైంది కాదు.

డా—లేకపోతే కొన్నాళ్ళపాటు యిరువురు పూ దోటలలో విహారం చేసి ఆత్మపరీక్ష చేసుకున్నతరువాత పెళ్ళి విషయమై ఆలోచించా లనిమా.

భ—పీలయిన అదియే నాకు సమ్మతం. కాని మన సంఘపరిస్థితు లలో అట్టిది చంద్రునికోసం ఆసించినట్టే. సంఘానికి నాగరికత అబ్బింతరువాత. స్త్రీ పురుషులకు విజ్ఞానమబ్బిన తరుపరి.

డా—అయితే మీా అభిప్రాయమేమిటి.

భ—కడసారిమాట వినండి. కట్నం పుచ్చుకోను. వారి కిష్టమయితే తగు ధనం వధువు కివ్వవచ్చును. అది వారిపని. ఆమెను ముందుగా చూడాలి. నాకంగీకారమైతే అపుడు తెలియజేస్తాను. ఫొటో కొంత నన్ను—ఆకర్షించింది. అందువల్లే యింతవరకైనా ఒప్పు కొన్నాను.

డా—ఏమోనండి. వారు పూర్వాచారపరాయణులు. ఒప్పుకుంటా రనుకోను. మళ్ళీ మీారు బాగా ఆలోచించి—

భ—(విసుగుతో) అదియే నా ఆఖరుమాట. యితరవిషయాలు మాటాడవచ్చు.

డా—అయినా గట్టిప్రయత్నంచేస్తాను. యీ విషయంమాత్రం పరమ రహస్యంగా ఉంచాలి.

భ—ఆహా! మీయుక్తికి యిలాంటివి నోకూతప్పిం. నారాయణరావు బిల్లుతీసుకురా (నారాయణరావు పళ్ళెములో బిల్లుయిచ్చును. భట్టుమూర్తి డబ్బుయిచ్చును.)

ఫలహారా లెలాగున్నా, బిల్లుమొత్తం దొరల రెస్టురాంటులే చవకని పిస్తుంది. వెళదాం. మీ రెక్కడికి.

డా—తిరువళిక్కేణి పోవాలి.

భ—నేను మద్రాసుకువస్తాను. రెన్ బెనెట్టులో నేలు ఒకసారి చూడాలి.

(నిష్క్రమణ - పోవుచుండగా తెర)

సీను iii

(చెన్నపట్టణం బీచి. వెనుక సముద్రం కనపడవలెను. ఒడ్డునకు బాటకు మధ్య పూలచెట్లు. యిరుకెలకుల చిన్నకంచెలవలె తయారు చేయబడిన పసుపుకు మొక్కలు. యిటునిటు షికారుచేయుచు పోవుచుందురు. సముద్రపు ఘోష వెనుకనుండి వినబడును. భట్టుమూర్తి నూటుతో మెల్లగా నడచుచు ప్రవేశించి)

భ—ఏమిది. సరిగా నడవడానికి కూడ దారిలేదే. చల్లగాలివీల్చడం రుచి ప్రజలకు బాగా తెలిసింది. నాగరికతాచిహ్నమే. ఊటీ నుండి అంతా దిగిపోయారు. అక్కడ వర్షాలు. తొమ్మిది మాసాలు ఎండలు యిక్క డనుభవించవచ్చు. నరసింహాం అదుగో వస్తున్నాడు.

నర—(సంతోషముతో)

హాల్లోమూర్తి—హావుడుయుడు.

భ—హావ్రతం, తుం. ఎప్పుడొచ్చావు. కొంచెం బలిసినట్లున్నావే.

నర—సెలవులు మూడు మాసాలు పనిలేక కూచోడంవల్ల అలా కనిపిస్తాను. పగలు మాడిపోడం. రాత్రి ఊపిరి తిరక్క ఉక్కిరి బిక్కిరయిపోడం. ఈయెండలు యమబాధ. నీకేంచల్లగా కొండల మీగనుంచి దిగావు.

భ—లేదు. ఈసంవత్సరం మా నాన్నగారు పట్నంలోనే ఉంచాశారు. అదిగాక మేలోనేగా, నాపెళ్లి. ఆ విజయనగరంలో యెండల మంట, దోమల గానం బాగా అనుభవించాం.

నర—నీ పెళ్లికి రావాలనుకున్నాను గాని, నీ ఉత్తరం అందేసరికి కొంచెం అనారోగ్యంగా ఉంది. అదీగాక ఎండల్లో ప్రయాణ మంటే—

భ—నీ వక్కడిదేనా సున్నితమైన ప్రాణం. ఒక ఉత్తరమైనా రానేవు గావే.

నర—ఏమున్నది రాయడానికి. పల్లెటూరిలో పదిరోజు లుండే సరికి, ప్రకృతిలో లీనమైపోతాం. పనిలేని తీరుబాటులేని మిథ్యావస్థలో చిక్కి సమాధిలో పడతాం.

భ—సమాధివల్ల లోచూపు అబ్బుతుంది. ప్రపంచాన్ని శోధించ లేకపోయినా, జయించినట్లు తోస్తుంది. ఆ స్థితి వర్ణించలేక పోయావు.

నర—అలాంటి వర్ణనలు ఉత్తరాల్లో రాయడంకూడ ఒక లలితకళే. నాకంత సామర్థ్యం లేదు.

భ—సామర్థ్యం అభ్యాసంకూడ కుదరవచ్చు. అయినా నీవు లేక పోవడం చాలా లోటయిపోయింది. నా గొడవ చెప్పుకోడానికి ఎవరూ లేకపోయారు. సుబ్బయ్య వచ్చాడు గాని, ఎప్పుడు నిద్రే. దోమలను జయించింది వా డొక్కడే.

నర——నీకోరిక సాగిందా! స్వయంవరం లభించింది. మొదట ఆమెను చూడ్డానికి వెళ్లినప్పుడు తమాషా అని చెప్పావే. అమనోహరాం గిని ఒకసారి చూచేసరికి లవ్ ఎట్ ఫస్టు సయిటుగా (Love at first sight) కాబోలు. పదిహేనురోజుల్లో ముహూర్తం ఏర్పాటు చేసుకుని విమర్శించకపోయింవని.

భ——అది మా నాన్నగారి చేత. వప్పుకున్నాను, యింక ఆలస్యం చెయ్యకూడదని, కాలి మొర్రగా ఉన్నప్పుడే సాగదీశాను. అయినా కొంత ఫేటు నుదుట వ్రాసిత కూడ ఉంటుంది.

నర——ఓహో! మనుష్యుని స్వతంత్రయిచ్ఛ, మొదలైన భావాలన్ని ఏమయినాయి. వివాహం మంచి పాఠాలు బోధిస్తున్నాది.

భ——అనుభవంవల్లే జ్ఞానం వస్తుంది. ఇదివరకుండే అభిప్రాయానికి భిన్నంగాదే. మానవజీవితంలో కొంత యేర్పాటు చేయబడిన పరిస్థితి. కొంత స్వయంకృషి. రెండు కలిసి వుంటాయి. పూర్తిగా ఒకటే ఉన్నదనడం వెర్రి.

నర——కాని ముఖ్యవిషయం. నీభార్యను తీసుకువచ్చావా. యీకొత్త జీవితం రమ్యంగా ఉంది కాబోలు.

భ——యింకా తీసుకురాలేదు. కొన్నాళ్ళవుతుంది. జీవితంలో ఏదో మార్పు గలిగినట్టు తోస్తుంది. మనస్సుకు యిదేమిటో చూదాం అనే కుతూహలం కలుగుతూవుంది. నీకుగూడా నిజమైన వివాహం సెలవులలో అయిందట. రాజమండ్రిలో ప్రాక్టీసు చేస్తానని చెప్పావే.

నర——మావాళ్లు ఎంతైనాకూడా ఒకసంవత్సరం వెలిగించమన్నారు. బుచ్చిరామయ్యగారివద్ద చేరాను. తన ఆఫీసుకు నాయిష్టం వచ్చినపుడు రావచ్చని చెప్పారు. ఎప్పుడైనా హైకోర్టుకు షికారుగా వెళ్లవచ్చు. యిదే డ్యూటీ. ఒక సంవత్సరం హాయిగా పట్నంలో

ఉండవచ్చు. చదువు ముగించినతరువాత ఈమాత్రం విశ్రాంతి ఉండాలి.

భ—మన కిప్పుడు విశ్రాంతే. చదువుకునే రోజుల్లో పుస్తకాలతో సంబంధం అపుడే. ఇప్పుడు విదేశసంచారంచేస్తే కొంత మనో వికాసమైనా లభిస్తుంది.

నర—నాయాత్రలు గ్రహాల సంచారంవలె ఎప్పుడూ ఒకమార్గంలోనే నడుస్తాయి. మావూరినుంచి యిక్కడికి,యిక్కడినుంచి మావూరికి. ఇక మనోవికాసం భార్యవల్ల కలగాలి. కొద్దిరోజుల్లో నాభార్యను తీసుకువస్తా. పరశువాకంలో యిల్లు కుదిర్చాను.

భ—ఆవిడకు కూడా నాగరికతామతం బోధిస్తాం. గృహస్థాశ్రమ ప్రవేశానికి, మనస్నేహితు లందరికి మీయింట్లో విందుచెయ్యాలి. బ్రహ్మచార్యత్వానికి సెలవివ్వడానికి, నువ్వది విడిచిపెట్టడానికి అనేక సంవత్సరాలనుంచి ప్రయత్నం జేస్తున్నావు. నేనొకత్రుటిలో మారిపోయాను.

నర—నీ బ్రతుకంతా విచిత్రం. నీవు చెప్పినట్టు విందు చేదాంలే. నీభార్య వచ్చింతరువాత మావాళ్లతో స్నేహం చెయ్యాలి.

భ—ఓ తప్పక. వాళ్లిద్దరకు బాగా స్నేహం కుదరవచ్చు. యిద్దరు పల్లెటూరి పడుచులే. పూర్వసాంప్రదాయాల్లో పెరిగినవారు. నాగరికతాభావాలు వెతకినా కనపడవు.

నర—పరిచితునివలె నా భార్య గురించి మాటాడుతున్నావు. నా భార్య అందరివలె గాదు.

భ—అదిగో. ప్రతిమనిషీ ఆవిధంగానే తలస్తాడు. కాని మన స్త్రీలలో వ్యక్తిత్వ మెక్కడుంది. అందరూ రమారమి ఒకటే సైపు. అందులో చిన్నభేదం ఒకటుంది. అది నీతివిషయం. నీతిని అనుసరించినవారు అందుకు వ్యతిరేకంగా నడిచేవారు. ఈరెండు ఒక

చెట్టు కొమ్మలే. ఏకొమ్మకు ప్రాముఖ్యత లేదనవచ్చు. ఒకవిధమైన ధైర్యం కొందరికుంది. కొందర కదిలేదు.

నర—నుస పరిస్థితులలో దేనియందు నీకభిలాష ఉన్నట్లు కనపడదు. గృహస్థాశ్రమం కొన్ని మంచిపాఠాలు నీకు బోధిస్తుందిలే.

భ—నేకోరేది అదే. నాభయం ఏమిటంటే తుదకు ఈఆశ్రమంగూడ గొడార్లిగా తయారయి నాఆశను భంగం చేస్తుందని

నర—మన స్నేహితుడు జగన్ మోహను యింగ్లండుకు వచ్చేవారం వెళుతున్నాడు. ఆక్స్‌ఫర్డ్‌లో చదువుతాడట. తరువాత సివిల్ సెర్వీసుకో, బారుకో చదువుతాడట. నీతో చెప్పమనికూడా చెప్పాడు.

భ—అదృష్టవంతుడు. పాశ్చాత్యనాగరికత అంచి స్వయంగా అనుభవించవచ్చు. కాని క్రొత్తమార్గాలు కృషి చెయ్యడంలో అభిలాష కలవాడు కాడు. శ్రమలేకుండా కాలంగడపడమే అతని సూత్రం. యితన్ని మార్చగలిగితే పాశ్చాత్యసంఘంలో జీవితసారం ప్రబలి ఉందని మెచ్చవచ్చు. అచ్చటి విద్యయొక్క శక్తినిగూడ గ్రహించగలం. ఎంతకాలం యింగ్లండులో చదువు. నీకు తెలుసా.

నర—నాలుగుసంవత్సరాలు పట్టునట. నిఃలు పాసవుతాననే నమ్మకం అతనికి లేదు.

భ—అతనికే లేకపోతే, అతన్ని పరీక్షించేవారి కంతకంటా ఉండదు. చివరకు ఈ బారిస్టర్ల సమూహంలో చేరి నీకు పండితిస్నేహితుడవుతాడు.

నర—నీకుమాత్రం కాదా. అడగడం మరచాను. ఎవరివద్ద ప్రవేశించావు, ఎప్రెంటిసుగా.

భ—ఎప్రెంటిసుగాడవ నాకు లేదు. లావద్ద సెలవు పుచ్చుకున్నాను. ప్రస్తుతస్థితిలో నావంటి విమర్శనాపురుషునికి ప్లీడరివృత్తి సరి

కాదు. పూర్వుల అభిప్రాయాలయందు నిరాటంకమైన గౌరవం ఉన్నవారే ప్లీడరీలో నెగ్గగలరు.

నర—అయితే యిప్పుడు ప్లీడరీ చేస్తున్నవారందరికి అలాంటిగౌరవం ఉన్నదా. ఉదరపోషణార్థం ఏదో ఒక వృత్తి అవలంభించాలికదా.

భ—యిప్పుడు ప్రత్యేక కృషి ప్రబలి, ఎవరివృత్తి వారి జీవితాన్ని, ఆవృత్తి ధర్మమైన ఆకారంలోకి మారుస్తున్నది. అందులో ప్లీడరీ జీవితాన్ని పరిపాలిస్తుంది. అన్నివిషయాల్లోను, యింటివిషయాల్లోకూడ నాలాంటివాన్ని కలతపరుస్తుంది. అంచేత దాన్ని విడిచాను.

నర—అయితే యేమి జేస్తావు.

భ—యింకా నిశ్చయంలేదు. మూడుపాళ్లు బ్యాంకులో ప్రవేశిస్తాను. ఏవో కొన్ని సంఖ్యలు కలిపివెయ్యడం కొట్టివేయడం. పెద్ద ఉద్యోగం వస్తే అదీ ఉండదు. గుమస్తా దస్కతు చేయమన్న చోట చెయ్యడం. నెల అయేసరికి జీతంపుచ్చుకోడం. మన చిత్తం వచ్చినట్టు బ్రతకడం. అభిలాష ఉన్నపనులు చేయడం. అది నా జీవితవిధానం.

నర—బాగు! బాగు! నీ యజమానులను సేవించేవిధం యిదేనా.

భ—వారికి కావలసింది దే. యంత్రంలాగు నియమించిన పని చెయ్యడం. అంతకు మించి మన తెలివి ఉపయోగించి, మార్పు లేమయినా సూచిస్తే, త్వరలో ఉద్యోగంనుంచి తొలగించేమార్గం చూస్తారు. ఎందుకంటే, అలాంటి స్వతంత్రాలు క్రింది ఉద్యోగస్తుల కిస్తే, వారికే ముప్పు వస్తుందని.

నర—చాలా సమంజసంగా చెప్పావుగాని మనకు అట్టిది ఆదర్శనీయమా?

భ—బాంకుపని కింతకంటే ఆదర్శమేమిటి.

నర—సరే మనం ఎప్పుడు తిరిగి కలుసుకోడం. యిప్పుడు పరశువాకం వెళ్లి హుజూరువారిని ఆహ్వానించడానికి కొన్ని యేర్పాటులు చెయ్యాలి.

భ—జగన్మోహనుకి మన మంతా కలిసి కోమలవిలాస్‌లో విందిస్తే బాగుంటుంది. రేపు ఉదయం మా యింటికి రా. అక్కడ ప్లాను తయారుజేదాం. యింకా ఎవరైనా ఫ్రెండ్సుంటే తీసుకురా. యిప్పు డెక్కడికి?

నర—ట్రిప్లికేను వెళ్లి కారాకిల్లీ బిగించి యింటికి పోతా.

భ—సర్ గుడ్ యీవినింగ్. నే నింకా కొంతేసేపు వీధినాటకం చూడాలి.

(చెరియొకవైపు నిష్క్రమణ — తెర.)

సీను iv

(భట్టుమూర్తి యిల్లు. తలిదండ్రిని విడిచి ప్రత్యేకముగా నివసించును. అందులో డ్రాయింగురూము. గోడల చిత్రపటములు. గది మధ్య చిన్న బల్ల. అందుపై పూవులుగల పాత్ర. యిరుప్రక్కల సోఫాలుండును. భట్టుమూర్తి పేపరు చదువుచుండును.)

నర—(చిరునవ్వుతో ప్రవేశించును) గుడ్ మార్నింగ్ మూర్తి.

భ—గుడ్ మార్నింగ్. ఏమిటి నూకులాసాగా ఉన్నావు. ఊసుపోక పేపరు చూస్తున్నా. ఎడ్వెర్టైజుమెంట్లు, (Advertisements) హత్యకేసుల రిపోర్టులు, కొంత రాజకీయపుచెత్త తప్ప మ రేమీ కనపడవు. యీ పేపరు చదవడం మీయర్ వేస్టు.

నర—అప్పుడే ఖండించడం ఆరంభించావు. రష్యాదేశపు నిహిలిస్టులే నాకు మతగురువులు. మీరు మొన్న మా యింటికి వచ్చినందుకు తిరిగి మే మిద్దరం మీయింటికి వచ్చేం.

భ—యిద్దరు యేమిటి.

న—మా శేషు కొంచెం సిగ్గు పడింది. వరాండాలో నిలుచుంది.

(కొంచెము సకిలించును.)

భ—ఏమిటిది. మీకు కూడా ఘోషామతం అబ్బుతుందే. మహమ్మ దీయుల ననుసరించి కొందరు హిందువులు ప్రారంభించేరు. ఆకొం చెమతం అందరిని ఆకర్షిస్తుంది. స్త్రీల కిదొక కొత్త సంకెల అన్నిటికంటె కఠినమైంది. మాటల్లో పడిపోతున్నాం. శేషమ్మ గారిని తీసుకురా.

(నరసింహం వాని వెనుక మూర్తి ఎడమద్వారంవైపు) పోవు దురు. తిరిగి వత్తురు. శేషమ్మ ప్రవేశం. చామనచాయ, కాళ్లను, చేతులను, మెడలోను పూర్వపు ఆభరణాలు. చిన్నవయస్సే కాశెబిగి చీర కట్టు.)

భ—కూచోండి శేషమ్మగారు. (అందరు కూచుందురు) మమ్మలని పరాయివాళ్లగా భావిస్తున్నారు. అనుమతిలేంది యింటో ప్రవే శించరు కాబోలు.

శే—లేదండి యితరు లెవరయినా ఉన్నారేమోయని సంకోచిం చాను. యీయనగూడ చూసి వస్తానని ముందడుగు వేశారు.

భ—నరసింహం! యిదిగూడ నీతప్పే. నీకు నూతనవిధానాలు ఎంత బోధించినా యీ అనాగరికత నుండి తప్పించలేక పోతూన్నాను.

న—నీ భావాలన్ని నచ్చినట్టే ఉంటాయి. కాని ఆచరణలోకి మాత్రం తేలేను. అది లోపమే గాబోలు. కాని ఈవిషయంలో—స్త్రీలు పరపురుషులుండే చోటికి నిర్భయంగా తోసుకు రావడం, వారి కుండే సహజమాధుర్యాన్ని మలినం జేస్తుంది.

భ—స్వేచ్ఛగా సంచరించడం మోటుతనమా. ఏమండి శేషమ్మ గారు మీ అభిప్రాయం ఏమిటి.

శే—నాకేమి తెలుసునండీ. పూర్వపద్ధతుల్లో పెరిగిన దానను. వాటి ననుసరించడమే సులభంగా కనుపడుతుంది. ఈచర్చలతో స్త్రీల కేమిపని. కమలమ్మగారేం జేస్తున్నారు.

న—మూర్తి మాటలసందడిలో అన్నీ మరుస్తాను.

భ—యింగ్లీషు చెప్పే దొరసాని వచ్చిందని. చదువుకుంటుందని. ముగిసిం దనుకుంటా.

న—అయితే యిప్పుడు తొందరపెట్టవద్దు.

భ—అదిగో వస్తుంది. మన సంభాషణ శబ్దం వినపడింది కాబోలు (ఎడమవైపుకు చూచును. కమలమ్మ మెల్లగా ప్రవేశం. మంచి రంగు. కోలని చక్కనిముఖం. కొంచెము పొడుగరి. మందగమన) మీ స్నేహితురాలు శేషమ్మగారొచ్చారు.

క—(శేషమ్మవంకకు పోయి) ఏమండి యిన్నాళ్లకా రావడం. తీరు బడి లేదు కాబోలు.

శే—తీరుబడి లేకేం. ఏంపని ఉంది. భోంచేయడం నిద్రపోవడమే కదూ. మావారు రేపు వెళదాం రేపు వెళదాం అని కాలయాపన జేసేరు.

భ—నరసింహం! మాశారదా యిందులో కూడ నీదేతప్పు. స్త్రీలకు సహజంగా ఆరోగ్యవాంఛ ఉంటాయి. పురుషులే వాటిని ఆటంక పరచి—

న—అయితే స్త్రీ పురుషుల స్థానాలు మార్చివేసి స్త్రీలకే పురుషుల మీాద అధికారం యివ్వ గూడదూ?

భ—అది మరియొక విధమైన బానిసత్వం. ఎవరి స్వతంత్రం వారి కిచ్చే ప్రయత్నం చెయ్యాలి. సరేగాని మనం మేడమీాదకు పోదాం రా. యిప్పట్లో మన సంభాషణ ఆడవాళ్లకు రుచించదు. వారి సంభాషణ మనకు రుచించినా మనం దగ్గర ఉంటే మనసిచ్చి

మాట్లాడరు. అంచేత ఎడబాటే శ్రేయస్కరం. నా— (కుడివైపు నుంచి భట్టుమూర్తి నరసింహం నిష్క్రమణ)

శే—మీయిల్లు ఎంత అందంగా వుంచారు. కళ్లకు ఆనందంగా వుంది. మీ వారికి చక్కని వస్తువు లంటే చాలా అభిలాష. నీవంటి చక్కని దానవు భార్యా వైనావు.

క—నా చక్కదనంతో ఆయన తృప్తి పడినట్టు కనపడదు. ఎంతసేపు నన్నొక కొత్తమనిషిగా మార్చివేయాలని ప్రయత్నమే. నామాటలు, దుస్తులు, ఆచారాలు, గుణాలు, ఏమీ వారికి నచ్చినట్టు కనపడదు.

శే—నీమీదుండే ప్రేమచేతనే మరింత విలువైన వస్తువుగా చెయ్యాలని వారి అభిప్రాయం. స్త్రీల అవస్థలను గురించి నాతో ఎప్పుడు ముచ్చటించే వారు.

క—నరసింహం గారికి కూడ ఈ అభిలాష పట్టు పడిందా.

శే—మూర్తిగా రంటే ఆయనకు విపరీతమైన ప్రేమ. అంతే. నాదగ్గర ఈసంస్కరణ విషయాలేమి మాట్లాడరు. ఏదో గృహకృత్యాలు తీర్చుకోవడంతో మాపని అవుతుంది. మా మేనమామ కొడుకు ఒకడు ఈమధ్య వచ్చాడు. దేహంలో స్వస్థత లేక యిక్కడ వైద్యులదగ్గర మందు పుచ్చుకోడానికి. ఆయనకి పరిచర్యలతో సగం కాలం అవుతుంది. మావారు కూడ ఉదయం, మధ్యాహ్నం వారిని డాక్టర్ల యిళ్లకు వెంబడించడంతో సరిపోతుంది.

క—బంధువులకు కష్టం వచ్చినప్పుడు సహాయం చెయ్యవద్దా?

శే—వద్దనను. కాని స్వంతపని ఎప్పుడు చూస్తారో నాకు తెలియదు. అడిగితే ఒక సంవత్సరం యిలా తిరగడం తప్ప యింకేమి లేదంటారు. నా కెందుకమ్మా వారిష్టం. నాకేం తెలుసును.

క—మావారైతే అది తెలుసుకొనే వరకు బోధించి బోధించి, కథలు

చెప్పి పద్యాలు చదివి విడిచి పెడతారు.

శే—మాటలవల్ల రాజ్యాలు జయించగలరు. యింగ్లీషువారు సామ్రాజ్యాన్ని పార్లమెంటులో అన్ని విషయాలు చర్చిస్తూనే పరిపాలన చేస్తారని నాతో చెప్పారు. మీయింటి విషయాలు ఎలాగు జరుగు తున్నాయి.

క—యింటి పనులతో నాకేమి సంబంధం లేదు. అన్ని పనులకు ప్రత్యేక నౌకర్లను నియమించారు. వాళ్లమీద యజమాని మావారే. యింకా చాలా విషయాలు కృషి చెయ్యాలంది యజమానత్వానికి పనికి రానని వారి అభిప్రాయం.

శే—అయితే మరింత సుఖం. బాధ్యతలేని జీవితం.

క—అన్నివిద్యలు నేర్చుకోడమే నా బాధ్యత.

శే—అదెలాగు.

క—ఉదయం మధ్యాహ్నం దొరసాని యింగ్లీషు చెప్తుతుంది. యేరోజు పాఠం, ఆరాత్రి ఆయనికి చదివి వినిపించాలి. ఆరుమాసాల్లో రెండు వాచకాలు ముగించాను. యింగ్లీషు బాష రానిది, నవీన నాగరికత అబ్బదంటారు.

శే—యింకా యేమిటి కార్యక్రమం.

క—జంబూనాధఅయ్యర్ సంగీతం, వీణ నేర్పుతున్నారు.

శే—మీకు హార్మోనియం తెలుసునే.

క—హార్మోనియం అంటే ఆయనకు తలనొప్పి. అదిగాక మనవేపు నేర్పించే పాటకు సృతి, లయ, తాళములు లేవని, పాట నేర్పించే విధానం బోగంమేళాల వెనకాల ఫిడేలు వాయించే వాళ్లకు తెలియదని—

శే—ఫిడేలు వాయించే వాళ్లా.

క—వాళ్లేగదూ తెలుగుదేశంలో సంగీత గురువులు. అంచేత యిది

వరకు నేర్చుకున్నదంతా పూర్తిగా మరిచిపోయన్నారు. తిరిగి ప్రారంభించాను. మొదట అలంకారాలు వర్ణించి, తెల్లవారు జామున గాత్రసాధకం చేసేను. బాగా పట్టుపడిన తరవాత వీణ ననుసరించి వర్ణాలు నేర్చుకుంటున్నా.

శే—మీకంఠం చాలా తియ్యనిది.

క—సహజమాధుర్యం సాధనవల్ల గాని రంజిల్లదు.

శే—మూర్తిగారి మాటలు బాగా పట్టుబడు తున్నాయి. యింకా యేమి జేస్తున్నారు.

క—మధ్యాహ్నం భోజనం తరవాత తెలుగు పత్రికలు చదువుతాను. రాత్రి ఆయన పేపరు చదవడం ముగించి వివిధ విషయాలు గురించి మాటాడతారు. అప్పుడపుడు ఏదో ప్రబంధం గాని భారత భాగవతాలు గాని చదివి అర్థం చెపుతారు.

శే—భర్తయే గురువైనపుడు విద్య వినోదంగానె ఉంటుంది. యితర వినోదాలంటే రుచించవు గాబోలు.

క—లేకేం. ప్రతి శనివారం సినిమాకు వెళతాం. నా ప్రక్కన కూచోని అర్థం చెపుతారు.

శే—మేము గూడా మొన్న సినీమాకు వెళ్లాం. మా ఆయనను అర్థం చెప్పమంటే తెలుగులో చెప్పడం చాలా కష్టం, బొమ్మలు చూస్తూంటే చాలన్నారు. మళ్లీ వెళ్లాలని లేదు.

క—అర్థం తెలియకపోతే గందరగోళమే. ఎన్ని విషయాలు తెలుసుకో వచ్చు! ఎంతో ఆనందంగా ఉంటుంది!

శే—నేను గూడా మీతో వస్తూంటా.

క—మీవారి కిష్టమైతే. తప్పక—

శే—తనకు పని కల్పించకపోతే సంతోషంతో వప్పుకుంటారు. యింకా ఏమి జేస్తున్నారు.

క—ఆదివారం స్నేహితుల యిళ్లకు వెళ్లి ఫలహారాలు పుచ్చుకోవడం. మాయింటికి వచ్చిన వారిని గౌరవించడం. తరచు సాయంకాలం బీచికి కారులో షికారు వెళుతుంటాం. దిగి నడవమంటారు. నాకు సందేహంగా వుంటుంది.

శే—అవును. ఒకేసారి పూర్తిగా నాగరికతవస్తే ఏదైనా చిక్కురావచ్చు.

క—ఏమిటి చిక్కు.. ఈమధ్య తేనాంపేటలో పుష్పాల ప్రదర్శనానికి వెళ్లాం. పట్నంలోని పెద్దవారంతా స్త్రీ పురుషులు వచ్చారు. గవర్నరుగారు వినోదప్రారంభ సంస్కారం చేసారు. అందరితోపాటు మేము గూడ తోటంతా తిరిగి వింత వింతలైన పుష్పసమూహాలని చూచి సంతోషించాం. మనస్సుకు మరువజాలని ఉల్లాసం యిచ్చింది. నరసింహాగారు కూడ కనపడ్డారే.

శే—చూచారా నాతో చెప్పనైనా లేదు. ఈ పల్లెటూరు వెంకమ్మకెందుకీ నూతన వినోదాలని కామాసు!

క—ఎవరో స్నేహితులతో కలిసి వచ్చినట్టున్నారు.

శే—స్నేహితుల మీదుండే ఆసక్తిలో సకం నామీదుంటే బాగుండును.

క—మీ కేమి లోటు, నాకొకప్పుడు యివన్ని వృధాఅని తలంపొచ్చి బాధిస్తుంది.

శే—జీవితంఅంతా వృధాయే. ఏమిటిశాశ్వతం.

క—బిడ్డలుంటే మనపేరు ప్రపంచంలో శాశ్వతం.

శే—పెళ్లయి యింకా సంవత్సరంకాలేదు. అప్పుడే బిడ్డలతలంపేమిటి. బిడ్డలుకలిగితే యీ విద్యావినోదాలన్నీ కట్టిపెట్టాలసిందే.

క—కాని యివన్నీ ఉండి బిడ్డలు లేకపోతే.

శే—లేనివస్తువుమీదికే పోతుంటుంది మనస్సు.

క—ఆ వాంఛయేగదా! మంచిమార్పులకు ఆధారం. (కొంచెమాగును.) ఫలహారపువేళయింది. రండి మాభోజనగదికి. వారికి మేడమీదకి పంపిద్దాం. (ఎడమవంకచూచి) డాక్టరు రామమూర్తిగారు వస్తున్నారు. మీకుగూడా యీయనేగదు గృహవైద్యులు.

శే—అవును వైద్యులుగాదు. అన్నిసప్లయిలు ఆయనే చేస్తారు.

(డాక్టరు రామమూర్తి ప్రవేశం)

డా—ఏమండీ శేషమ్మగారుగూడ యిక్కడే ఉన్నారు. చూశారా నావైద్యం మీ మేనమామగారి కొడుక్కి రుచించలేదు. వందలు ఖర్చు చేసారు. ఆకుప్పుస్వామయ్యరు ఏమిజెయ్యగలిగేడు. యింటి చెట్టుమందు ఈతపండంత విలువ.

క—మీరైతే నాలుగుమాత్రలతో కుదిర్చిఉందురు. కాని ఆ చీరలకి చమ్కీ వేయించమని యిచ్చి రెండునెలలు కావచ్చింది. ఈచీరలు కట్టుకుంటే నలుగురుండేచోటికి తీసికెళ్లడానికి మావారు విసుక్కుంటారు.

డా—మీరేచీరకట్టుకుంటే నేమమ్మా ఆచీరకే విలువ తెప్పిస్తారు. అయినా రేపు దగ్గరుండి తయారు జేయించి తీసుకువస్తా.

క—నా మెడలోకిహారం యింకా వేళమీనా యివ్వనేలేదు. అదిచాలా కష్టమైనపని. యిదివరకెన్నడు చెయ్యలేదని కాలయాపన జేస్తున్నారు.

డా—అదిగూడా కనుక్కుంటా.

క—మరి నాజాకెట్లమాటేమిటి. నే నేసుకొనేవి కమీజులని, శరీర సౌందర్యాన్ని కప్పిపుచ్చి వికారంగా కనపడేటట్టు చేస్తాయని అంటారు.

డా—అన్నీ ఒక్కసారేనా. అయినా వాళ్లకి లెక్చరిచ్చి త్వరలో తెప్పిస్తా. యజమానులెక్కడ.

క—నరసింహంగారితో మేడమీదున్నారు. ఫలహారానికి లేస్తున్నాం.

(కమలమ్మ శేషమ్మలు లేచి నిలుచుందురు.)

యిష్టమైతే క్రిందకు రమ్మనండి. లేదా మేడమీాదకు పంపిస్తాం.

డా—మంచిది మేడమీాదకు వెళతా.

(డాక్టరు ఒకపక్కకు వారింకొక పక్కకు పోవుచుండగా—తెర)



# సంపత్తులు

## అంకము 2

### సీను i

[బీచిమెరీనా 1 వ అంకము మూడవసీనువలెనే. తోటలో ఉపయోగించే యినుపకాళ్ల బెంచీ ఒకటి అధికము. ప్రవేశము భట్టు మూర్తి కమలమ్మ. మూర్తి చక్కని సూటుధరించి చేతిలో కర్రను పట్టుకొనియుండును. కమలమ్మ మరియొక వ్యక్తివలె కనబడును. క్రొత్తవిధమైన జాకెట్టు, తల పార్సీవారివలె అలంకరించుకొని, చెంకీ చీరకొంగు తలపై నిడును. జోడు ఒకటి, రెండు బంగారుగాజులు, మెడలో ఒకే హారము.]

భ—ఈ బీచి లేకపోతే యీపట్నం యేం గావలసింది. చెంద్రుడు లేని రాత్రి.

క—బీచిని బట్టియేగా పట్నం యేర్పడింది. పట్టణ నిర్మాణము తెలియక పురపాలకసంఘాలు తగినయేర్పాటులుచేయక అడ్డదిడ్డంగా పెరిగింది.

భ—అవును. వస్తువుయొక్క ఆకారం దారి జూపించేవాని నిపుణత్వములో ఉంటుంది. చూడు మనకు వివాహమై అయిదు సంవత్సరాలైంది. అపుడు జూచినవాళ్లు నిన్ను మధ్య కలుసుకోకుండా యిపుడు జూస్తే పోల్చనేలేరు. మరియొక వ్యక్తివై పోయేవు.

క—ఇదంతా మీ నిపుణత్వమే. కుమ్మరివానిచేతిలో మట్టివలె మీరు కావలిసిన ఆకారంలోకి మార్చుకొన్నారు.

భ—సంపదలను మట్టితో సరిపోల్చడమూ వైభవాల కంటె లోపాలు విలువైనవి. దేహ సుఖముల కంటె ఆత్మసుఖాలు హెచ్చైనవి.

క—నా ఆత్మను మాత్రము మార్చలేదా అదియే గొప్ప మార్పు. విద్యావంతురాలిగా చేసారు. ప్రపంచ సౌందర్యాన్ని కళల సందేశ పూర్వంగా గ్రహించడానికి తగినశక్తి ననుగ్రహించారు.

భ—నేను కొంత శ్రద్ధతో శ్రమపడి ఉండవచ్చు. నా బోధనలను గ్రహించి వినియోగములోకి తెచ్చే ఆత్మశక్తి నీలో ఉన్నది కాబట్టి నా కోరిక ఫలించింది.

క—నన్నేగాదు. మీతో సహవాసం చేసేవారి నందరినీ మంచికి మారుస్తూనే యుంటారు.

భ—అదేమో. నేను పూనుకొని చేయలేదే. నీ విషయములో మాత్రం ప్రేమ సంబంధము కాబట్టి సంకల్పంతో కూడుకొని యుంది. మిగిలినవి అకారణ ఫలితాలు.

క—కారణము లేకుండా ఫలితము కలగదే. అన్నిటికి ప్రేమయే ఆధారం. మీరు స్నేహితుల్ని పరిస్థితుల్ని కూడ ప్రేమిస్తారు.

భ—నిజమైన ప్రేమకు కారణముండదు. అప్పుడే అది స్పృశించిన వస్తువులన్నీ దివ్యంగా పుష్పిస్తాయి.

క—ఇంగ్లండునుంచి మొన్ననే తిరిగివచ్చిన జగన్మోహన్‌గారుకూడ మీ శిష్యవర్గములో చేరినట్లున్నారే. మొన్న గోల్కొండ హోటలులో స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించిన డిబేటులో మీ పక్షమే వాదించేరు.

భ—శిష్యులు కారు. స్నేహితులు. నాకు అతనికి చాలా విషయాల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. కాని పాశ్చాత్య సంఘజీవితపు రుచి బాగా తెలుసుకొన్నాడు కాబట్టి స్త్రీలకి స్వాతంత్రం మనలో చాలదని నాతో ఏకీభవించాడు.

కమ—ఆ దేశపు ముచ్చట్లు బాగా చెపుతారు. మనయింటికి టీకి వచ్చి రెండు వారాలైంది. తిరిగి పిలువరాదూ!

భ—క్రొత్తగా వచ్చాడు. అతని కాలమంతా విందులతో నిండి పోతూంది. ముచ్చటైన విషయాలు చర్చించడానికికూడా సావకాశం లభించడంలేదు.

కమ—అదిగో దూరంగా ఇటువైపు వస్తున్నారు—జగన్మోహన్ గారు.

భ—ఎక్కడ (కమలం చూపినవైపు తేరిచూచును) నీది ఎంత సూక్ష్మదృష్టి. చిరపరిచితుణ్ని నేనుగూడ యింతదూరంనుంచి పోల్చలేనే.

కమ—ఆయన్నిగురించి యిప్పుడే మాటాడుతున్నాం. అంచేత నిజ స్వరూపాన్ని సులభంగా గుర్తించేను. (ప్రవేశము జగన్మోహన్. కొంచెము పొడుగరి. చామనచాయ. చక్కని సూటు. దొరటోపీ చేత పట్టుకొనియుండును)

జగ—గుడ్ యీవినింగు మూర్తి. గుడ్ యీవినింగు కలమ్మగారు.

కమ-భ—(ఒక గొంతుతో చిరునవ్వుతో) గుడీవినింగు.

కమ—చాలాకాలానికి మీ దర్శనం. కాని యీలాగ అకస్మాత్తుగా కలుసుకొన్నపుడే ఉల్లాసంగా వుంటుంది. మనకు తెలియకుండా తటస్థించేవే ఆనందదాయకాలు.

జగ—మీ యిరువురిలో యెవరుమాటాడినా ఒకవిధంగానేఉంటుంది. స్త్రీపురుషులు వ్యతిరేకకోణాలు ఆక్రమించినపుడే ఆకర్షణ హెచ్చుంటారే.

భ—అది మొదట్లో ఉండవచ్చు. కాని అనురాగంగల దంపతులకి కొంతకాలానికి ఒకరిగుణా లొకరికివచ్చి సమానమగు చిహ్నాలు పుడతాయి.

జ—ఇది అనుభవవేద్యం. నాకు యింతలో తటస్థించకూడదు.

భ.—ఏమి స్నేహితుల్లోమాత్రం ఒకరి గుణాలొకరి కబ్బడంలేదా.

జ—అలాగైతే వ్యక్తిత్వకవ్యక్తిత్వ కృషి ఏమౌతుంది.

భ—దాన్ని పోషించడం యీ సమ్మేళనకు భంగకరంకాదు. ఒక గొప్పవ్యక్తి తన మనో బలంవల్ల ప్రపంచ పరిస్థితుల్ని మార్చి వేస్తాడు. మతస్థాపకులు అలాంటివారే—జీసస్ క్రైస్టు, బుద్ధుడు.

జ—మతమంటే నాకు రుచి తక్కువ. ప్రవేశం అంతకంటే సున్న.

కమ—మన దేశంలో మతమే సంఘజీవనానికి ముఖ్యవిషయమని గంభీరవాక్యాలు పలుకుతారే.

భ—కావచ్చు కాని దాని ఉపయోగం జీవిత ధనచ్యాను నడిపించగల శక్తినిబట్టి ఉంటుంది. మన వేదాంతప్రబోధాలకి లౌకికవ్యాపారానికి బొత్తిగా సంబంధంలేదు.

కమ—అట్టి సంబంధం కలిగించడానికి ప్రయత్నం చేయరాదా.

భ—ప్రయత్నంవల్ల కొనసాగదు. అది మతప్రబోధనలో అంతర్గతమై ఉండాలి. యీ చర్చ మోహన్‌కు రుచించినట్టు కనబడదు.

జ—రుచించకేం. మీరు ఏవిషయముగూర్చిమాటాడినా జీవకళలతో వింటుతారు. నిన్న రాత్రి దొరల క్లబ్బులో డాన్సుకి రాలేదేమి. మన స్నేహితు లంతా మీకోసం కని పెట్టుకున్నారు.

భ—మా నాన్నగారి యింటికి వెళ్లేం. వారే నాకున్న బంధువులు.

జ—ఎలాగైనా తప్పించుకొని రావలిసింది. కమలమ్మగారికి డాన్సింగులో ప్రవేశం లేదుకాబోలు.

కమ—బాగుబాగు. ఇప్పటికే మా బంధువు లంతా పాశ్చాత్యపద్ధతుల్ని అవలంబించామని దొరల మైపోయామని నిరసనభావం చూపిస్తూ మా యింటికూడా రావడం మానేసేరు.

జ—కొంత గొడవ తగ్గిందని సంతోషించవచ్చు. ఈ భావినత్వంవల్ల

ఏమిటి ఉపయోగం.

కమ—పూర్వం చాలా లాభ ముండేది. జాతిలో ఐకమత్యము, ఒకరి కొకరు సహాయము చేయడం, విధిగా యుండేది. ఇప్పుడు మిగిలిన దనూ రొక్కటియే.

జ—(కొంచెము కోపముతో) అట్టి సంఘాన్ని త్వరలో నసింపజేయుడానికి ప్రయత్నించడమే మన విధి.

భ—కేవలము కోపంవల్ల మన భావాలు పరిబోధం చేయలేము. శాంతింగా ఆచరణలోనికి పెట్టి చూపించాలి. మొదటలో అనాదరవం కలిగినా, ఓడిపోయినా, వానిలో జీవశక్తి యిమిడియుంటే తుదకు ఫలిస్తుంది.

జ—మీకు తొందరపనులేమి లేవుకదా. ఈ బల్లమీద కూర్చుని చల్లగాలి పీలుస్తూ మాటాడదాం రండి.

(అందరునూ బల్లపైని కూర్చుందురు. మధ్యను కమలమ్మ)

జ—ఇంత విశాలమైన బీచి ప్రపంచంలో యెక్కడా లేదట.

క—ఒకేవిధంగా ఉండడంచేత కంటికి విశ్రాంతిలేదు. విశాఖపట్నంలో ఒకవైపు సముద్రాన్ని ధిక్కరిస్తూ యున్న కొండ చక్రాకారంగా ఉన్న తీరం ఇంతకంటే అందంగా ఉంటాయని నా ఉద్దేశం.

భ—గ్రహించలేనంత వైశాల్యం వల్లనే విశ్వం ఆశ్చర్యము కలుగజేస్తుంది. అదియొక విధమైన సౌందర్యం.

క—చిన్నపువ్వులోగూడ జీవశక్తి యిమిడుంది. మీరు విశ్వం అంత విశాలంగా ఉందని ఆశ్చర్యపడితే నేను యీపువ్వు యింతచిన్నదైనా చెప్పరాని సౌందర్యముతో తాండవిస్తూంది అని సంతోషపడతాను. ఏమంటారు జగన్మోహన్ గారు.

జ—మీరు చెప్పింది బాగుంది. ఫ్రాన్సుదేశపు పశ్చిమ తీరంలో చిన్నచిన్న పట్నాలున్నాయి. యెండాకాలంలో యూరపులోని

ధనికులంతా వినోదార్థం అచటికి వెళతారు. ఆసముద్రతీరం చిన
చిన్న కొండలతోను, రమ్యమైన ఆరామాలుతోను హృదయరంజ
కంగా కనబడుతుంది. ఆప్రదేశాన్ని రివీరా అంటారు.

క—ఎంత చక్కని పేరు. అక్కడి వినోదాలేమిటి.

జ—ఒక్కొక్క ఊరు ఒక్కొక్కందుకు ప్రసిద్ధి. అందరినీ సంతోషపరచ
టానికి విశ్వప్రయత్నాలు చేస్తారు. సాధారణంగా నలుగురైదు
గురు కలిసి యీ యాత్రలు సాగిస్తారు. స్త్రీ పురుషులు గంటల
కొలది సముద్రంలో స్నానము చేస్తూ, ఆననాయాన్ని వివిధమైన
జలక్రీడలు సలుపుతారు. తరువాత ఒడ్డున అందుకు ప్రత్యేకంగా
నిర్మింపబడిన చిన్న కుటీరములలో విశ్రాంతి పొంది అల్పాహారము
పుచ్చుకొని యెవరికినచ్చిన వినోదాలకి వారు వెళతారు.

క—ఏమిటా వినోదాల్లో ముఖ్యమైనవి.

జ—నాటకాలు, సినీమాలు, సంగీతాలు.

క—అవి ప్రతీపట్నంలో ఉన్నవేకదా.

జ—నిజమే కాని మంచి నిగ్గైనవి ఏరి ప్రదర్శిస్తారు. రాత్రుళ్లు పెద్ద
హోటేళ్ల ఉద్యానవనాల్లో డాన్సులు యేర్పాటు చేస్తారు. చక్కని
బ్యాండు సంగీతము ఉంటుంది. అతి రుచైన పదార్థాలు భుజిస్తూ
ద్రాక్షారసాలు గ్రోలుచూ సంగీతాన్ని ఆమోదిస్తూ యువ
జనులు నృత్యమొనర్చు సౌఖ్యము వర్ణింపగలమా. తోటను వింత
వింత రంగుల దీపాలతో అలంకరించి సేవకులుగూడ చిత్ర విచిత్ర
మైన దుస్తులను ధరిస్తారు. కొంతసేపచట కూచొనేసరికి యిది
స్వర్గలోకమా, గంధర్వలోకమా అని మనస్సుకి తోస్తుంది. ఒక
విధమైన ఉన్మాదం వస్తుంది. ఇంకేమి చెప్పను. భట్టుమూర్తిగారి
వలె కవిత్వ ప్రవేశం లేదు. లేనియడల బాగా వర్ణించియుందును.

క—ఉహూ ప్రపంచనిర్మాణానికి గూడ స్వానుభవపు పునాది ఉం

డాలి గదా. అది లేనిచో పిచ్చివాని ఊహాలువలె ఉంటాయి.

భ—"రవిగానసుచో కవిగాంచును గదా" అని చెప్పేరే.

క—మీరే చెప్పేరు. అది ఉత్ప్రేక్ష అని జగన్మోహన్‌గారి వర్ణన కవిత్వ రచనకు మించి యుంది. ఏమండీ అట్టి వినోదాలు ఇంగ్లండులో లేవా.

జ—లేకేమి. బ్రిటన్ ముఖ్యమైన సముద్రతీరపు పట్నాలు కేవలం వినోదార్థమే నిర్మించ బడ్డాయి. లండన్ నగరము నుంచి ప్రతీ ఆదివారం అనేకులు వెళతారు. రైళ్లలో స్థలముండదు. రోడ్లు మోటారుకార్లతోను, బస్సులతోనూ, నిండి పోతాయి.

క—వారంతా ధనవంతులు కాబట్టి తీరుబడి యుంటుంది. విచ్చలివిడిగా ఖర్చుచేసే సామర్థ్యం ఉంది.

జ—మన దేశంలో కూడ ధనికులు వేనవేలున్నారు. వారికి కీతలంపులు లేవే. దేశముయొక్క పరిస్థితులు ఆదేశస్థుల సాంఘిక సంకల్పాన్ని బట్టి యుంటాయి.

భ—ఒకని సంకల్పమువల్ల కూడ దేశము మారిపోవచ్చు. నెపోలియన్ చక్రవర్తి తన సైనికు లందరినీ తన మనోబలముచే నింపగా చిన్న భటుడుకూడ మూర్తీభవించిన యుద్ధదేవుని వలె పోరాడేవాడు.

జ—ఆవిధంగానే కొందరు సైనికులు మూర్తీభవించిన పిరికిపందలాగు పరుగెత్తుతారు.

భ—అది వారి సైన్యాధిపతిని బట్టి. కాని నీతో ఒక విషయం చెప్పాలి నాస్నేహితు డొకడు వీరరసప్రధానమైన నాటకాన్ని రచించాడు. దానిని మాయింట్లో ప్రదర్శించా లనుకొంటున్నాము. మీరుకూడ పాత్ర ధరించాలి. ఏమంటావు కమలా.

కమ—ఔను. అందులో విజయమార్తాండుని పాత్ర వీరికి బాగా కుదు

ర్తుంది.

జ——నాకు సంగీతం లేదే. ఇంగ్లీషునాటకాల్లో వేషము వేసానుగాని తెలుగంటే భయం.

భ——ఈ నాటకంలో సంగీతం లేదు. ఈమధ్య వచననాటకాలు వృద్ధి చేసే తలంపుతో ఒక చిన్న కమిటీ ఏర్పాటు చేసాం. అవి సంభాషణాభాషలో రాయుట. పద్యాలు పాటలు లేకుండ కేవల కల్పితాలై యుండాలి. అంతే నిబంధన. అయితే అట్టివి పట్నంలో ప్రదర్శించడానికి తగిన ప్రోత్సాహం లేదు. కొందరి స్నేహితుల ప్రోత్సాహంమీద మా యింట్లో చిన్న స్టేజ్ ఏర్పాటు చేసాం. ఎవరైనా కొత్త నాటకం వ్రాసి మన కిస్తే కమిటీవా రంగీకరిస్తే ప్రదర్శించడం. ప్రేక్షకులు ప్రదర్శకులు మనమే.

జ——చాలా వినోదంగా యుంటుంది. నాకు చిన్నప్పటినుంచీ నాటకాలంటే అభిలాష.

కమ——అయితే ఆ పాత్ర ధరించడానిక్కి ఒప్పుకొన్నట్టే. ఈవిధంగానైనా మా యింటికి తరుచు వస్తూ ఉంటారు.

జ——మీవంటి విద్యావంతులైన స్నేహితుల సాంగత్యం నా కిచట దొరకడం ఏలాగు. అదీగాక మీ పాట వినాలని కుతూహలంగా ఉంది. వీణకూడ యింపుగ వాయిస్తారట.

కమ——సంగీతం అంటే యిష్టం లేనట్టు యిపుడే చెప్పేరే.

జ——నాకు రాదని చెప్పేనుగాని అందులో రుచి లేదనికాదే.

కమ——మీ కిష్టమైనపుడు రావచ్చు అంత గొప్పపాట కాదు. అయినా——

జ——ప్రతిదినం వస్తాను మీ కభ్యంతరం లేకపోతే.

భ——మా ఉభయులకూ సంతోషమే. నరసింహం దంపతులుకూడ రేపొస్తారు. మీరూ వస్తే నాటకం చదివి వినిపిస్తా.

జ—ఆలాగే.

(ఈ సంభాషణ జరుగుచుండగా మెల్ల మెల్లగా చీకటి పడు చుండును)

భ—చీకటి పడుతుంది. మీరెక్కడికి—మా కారులో రండి. మిమ్మల్ని విడిచి యింటికి పోతాం.

జ—థ్యాంక్స్. నన్ను మకాంటురోడ్డులో విడువండి.

(ముగ్గురూ నమస్కరింతురు)

(వారు స్టేజి దాటిన వెంటనే మోటారు హారన్ వినవచ్చును. అప్పుడు తెర.)

సీన్ ii

(భట్టుమూర్తి యింట్లో డ్రాయింగు రూమ్. వెనుక గదిలో రిహార్సలు జరుగును. జగన్మోహన్ యెడమపక్కనున్న సోఫాపై కూర్చుని సిగరెట్టును వెండి కేసునుండితీసి—కమలమ్మ కుడివైపు సోఫాపై కూర్చుని అల్లుచుండును.)

జ—సిగరెట్ (చేతిని కమలమ్మ వైపు చూపును.)

క—నేను సిగరెట్టు కాల్చనని మీకు బాగా తెలిసినా మాటిమాటికీ నాకందించ ప్రయత్నిస్తారు. పదిమందిలోను యిస్తే ఏమనుకుంటారు.

జ—సిగరెట్టు అభ్యాస ముందనుకుంటారు. లోకులమాట మీకింత వెరపనుకోలేదు. అయినా క్షమించండి. ఇకెన్నడూ యివ్వను. మీకింత అరుచిఅయితే నేనుకూడ కాల్చను.

(తిరిగి సిగరెట్టును కేసులో పెట్ట సూచించును.)

క—మీరెందుకు మానడం. పొగ సహాయము లేనిదే ఆలోచనా ప్రవాహం పారదుగా.

జ—అది మోటు తనంగల మగవారికే వర్తిస్తుంది కాబోలు.

క—అయితే సిగరెట్లు కాల్చే వారిని చూసి మోహిస్తారా ?

జ—మిమ్మల్ని ఒప్పించలేను. (కొంచము కినుకచేత డియూరంవంక జూచి) ఏమి ఒంటిగంట కావచ్చిందే నాటకం రిహార్సలుకు.

స—ప్రకాశం సూర్యంతప్ప యెవరూ రాలేదు. మూర్తి వీరికోసం మోటారు కూడా తీసుకెళ్లేడు మొదట మా యింటికి వచ్చి—

క—అది నాకు తెలుసు. యీయనొక్కడికే యీ నాటకం అవస్థ. ప్రతి రిహార్సలుకీ పాత్రధారులందరినీ వారియిళ్లకు వెళ్ళి పిలచి వెంటవేసుకొని తీసుకవచ్చి ఫలహారాలిచ్చి నటనచేతకాని వాళ్ళనికూడ, ఆహా ఏమి బాగా యాక్టుచేశావని హెచ్చరిక చేసినా యింకా యెవరిపాత్రవారికి కంఠతా పట్టినా రావు. అందించినా అందుకోలేని స్థితిలో ఉన్నారు.

జ—నేనూ అందులోనే జమ.

క—మీకేం సైన్యాధిపతులు. గంభీరస్వరంతో సైనికుల్ని హెచ్చరిస్తూ కరవాలం పైకెత్తి విజృంభించి స్టేజిమీద గంతువేసేసరికి కరతాళ ధ్వనులతో గొల్లుమని కేకలతో నాటకశాలలోని వారంతా అభినందిస్తారు. అంతటితో సమాప్తి. సూత్రంలోనే మోక్షం.

జ—(నవ్వుచూ) మీది కూడా చిన్న పాత్రేగా.

క—ఈనాటకం వీరరసప్రధానం. కాబట్టి స్త్రీలకందులో ప్రాముఖ్యత లేదు. చూడండి ప్రతాపరుద్రీయంలో స్త్రీలకు వేషం వేసుకొని స్టేజిమీద నిల్చోడంతప్ప యింకేమిపని లేదు.

జ—ప్రధానరసం ప్రణయం అయితేనే గాని స్త్రీలకు ప్రాముఖ్యత రాదు. అందుచేతే బెర్నార్డుషా ఆరసం లేకుండ నాటకాలు రచించ వచ్చన్నాడు.

క—తన ముఖ్యనాటకాల్లో మాత్రం ఆ రసాన్ని యిమిడ్చాడు.

పూర్తిగా లేని నాటకం సింగపూజాన్‌లో స్త్రీయే ముఖ్యపాత్ర.

జ—మీకింత జ్ఞానమున్నందుకు పాశ్చాత్యథియేటర్లు స్వయంగా చూడాలి. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్కవిధమగు కళాపూరిత మైన నాటకాలు.

క—చాలా వరకూ చదివేను కాని ప్రదర్శనం చూడకుండ రసం గ్రహించలేం.

జ—అయితే నేను లోగడ మీకు చెప్పిన విషయమై యేమి నిశ్చయించారు.

క—ఏ విషయం.

జ—నేను తిరిగి పదిహేను రోజులలో ఇంగ్లండు వెళతాను—ఉద్యోగ ప్రయత్నమై. నాతో మీరు కూడా వస్తే యూరప్ దేశంలోని ముఖ్యపట్నాలకి పోవచ్చు. అచ్చటి విశేషాలు కనులార చూస్తేనే కాని జీవించిన ఫలం లేదు.

క—అవును. మొన్న చిత్రపటముల ప్రదర్శనానికి వెళ్లాం. అందులో కళాసౌందర్యం కల దొక్కటి లేదు. వేనస్సులూవరులోని చిత్రపటములు, ఇటలీ దేశపు చిత్రపటములు, సిల్పములు చూచి ఆనందించ డానికైనా యూరప్ పోవలసిందే. మనదేశంలో షాజహాన్ అవ్యాజప్రేమకు శాశ్వతసూచకమై భవనరాజమైన టాజమహాలుని గాని, అజంతా చిత్తరువులు గాని చూడలేదు గదా. నాకు యితర దేశాలు కూడానా.

జ—ఏమి యీరోజులలో ప్రయాణం యెంత సులభం. ప్రతీ పట్నంలో మన స్వగృహం కంటే సదుపాయంగా ఉంటుంది. ఇక స్టీమరు రైల్వే ప్రయాణాలు సుఖప్రదమే.

క—ప్రయాణమంటే నాకు చాలా వేడుక, కొత్తమనుష్యుల్ని కలుసుకోడం, రోజుకొక వింత చూడ్డం, కొత్తపట్నాలు ప్రకృతి విశే

పాలు కనిపెట్టడం హృదయరంజకం కదా.

జ—ఇన్ని కుతూహలమైన ఊహలు కలదానవు నాతో రాకూడదా. మూర్తి సమ్మతింప డనా?

క—ఆయనతో యీవిషయమై ప్రసంగించాను. నాకిష్టమైతే ఆయన కిష్టమే అని చెప్పేరు. ఇదివరకు యూరప్ దేశం బాగా అలవాటు పడినవారు గాబట్టి మీలా విలువైన మార్గదర్శకులకే అన్నారు.

జ—ఇంకేమున్నది. ప్రయాణం నిశ్చయమన్నమాటే. నా జీవితంలో అనేకులతో స్నేహంచేసాను అనేక సంతోషదినాలు గడిపేను కాని మనదేశం తిరిగి వచ్చినప్పటినుంచీ మీస్నేహం లభించి నప్పటినుండీ నా జీవితం రమణీయమై పోయింది. హృదయానికి ఒక క్రొత్తవికాసం లభించింది. ఇపుడు మీతో చెప్పక తప్పదు. మిమ్మల్ని రమ్మనడంలో కొంత స్వార్థంకూడా ఉంది. ఇపుడు మిమ్మల్ని విడిచివెళ్ళడం యేమీ మనస్కరించలేదు. జీవితం దుర్భరమై పోతుంది.

క—స్నేహితులగు మీకీ యెడబాటు రుచించనపుడు ప్రీతినిమిత్తం నాసుఖాన్ని కోరుచూ నాశరీరాన్ని ఆత్మని తనదిగా భావిస్తూ అవిరళమైన ప్రేమతో నన్నాదరిస్తూయున్న నాభర్తను విడిచి యేలారాగలను. అదియే నాసమస్య.

జ—(కొంచెము సందేహముతో) ఆయనమాత్రం రాకూడదా.

క—ఆయన రావీలులేదని యిదివరకే మీకు చేప్పేను. మీకు తెలును.

జ—క్షమించాలి. నాఆత్రుతలో కంగారుపడ్డాను.

క—ఆత్ర తెందుకు.

జ—ప్రపంచ సౌందర్యాన్ని మానవనిర్మితమైన కళా మాధుర్యాన్ని పూర్తిగా గ్రహించడాన్కి మీవంటివారు జోడుగాఉండాలి.

(భట్టుమూర్తి, నరసింహం, శేషమ్మ, డాక్టరు రామమూర్తి ప్రవేశం.)

భ—(కూర్చుని) వీళ్ళందర్నీ జతపర్చి తెచ్చేసరికి నాతలప్రాణం తోక్కొచ్చింది. మిగిలిన వాళ్ళెక్కడ.

క—హాల్లో నిద్రపోతున్నాగనుకొంటా. ఇకనెందుల కాలస్యం. రిహార్సలు ప్రారంభించండి. ఫలహారపు సమయం కావచ్చింది. అది ముగిసింతరువా తనుకొంటే బీచికెటు వస్తాతుంది.

న—కూం దేగదూ మొదటంకం. శేషుకి యింకా వణుకుపోలేదు. వేషంవేసి అసలు స్టేజి యెక్కేసరికి సర్దుకుంటుందని హెచ్చరిక చేస్తున్నా.

శే—ఏమైనప్పటికీ ఆ బూడిదమాత్రం మొహానికి రాసుకోను. తరువాత ఆకగుసీనులో నాచేయి యెవ్వరూ పట్టుకోవద్దు. నే చెప్పవలసిన నాలుగుముక్కలూ గడగడ అప్పచెప్పేసి పక్క కురికేస్తాను.

నర—అదుగో మేంమ్ చెప్పినట్టు వినాలిగాని నీ కిష్టం వచ్చినట్టు చేస్తే రసాభాసవుతుంది.

శేష—అయితే నాకీ వేషంగొడవద్దనే వద్దు.

భ—అతనితో యేం లెండి. మీకు యేలాగు వీలుగా ఉంటే అలాగే సాగిద్దాం. రండి డాక్టరుగారు. మీ మామూలు వేషమే మీ పాత్రకు చాలు. ప్రత్యేకంగా నాటకానికి వేషం వేయనక్కరలేదు.

డా—అంచేత న న్నెరిగినవాడే ఆ పాత్రని నాటకంలో యెక్కించాడనుకొంటా.

భ—సరే. మొదట శ్లోకాన్ని చదువుతూ మీరు ప్రవేశించాలి.

(మోహన్ కమలమ్మలు తప్ప మిగిలినవారంతా లోనికి పోవుదురు.

డాక్టరు యేదో గొణుగుకొంటూ వెంటాడుకొను. మోహన్ లేచి కమలమ్మ సోఫాపై కూర్చుండును.)

కమ—మనం తరవాత వెళ్లవచ్చు. మూడవ అంకంలోనే కాదూ.

జ—బాగానే కుదిరింది. మీది అక్కడే ప్రారంభం. ఏనాటి ప్రయాణం నిశ్చయం అన్నమాటేనా? ఈవేళ మన స్నేహితులందరితో చెప్పవచ్చు. రేపు ప్రయాణసన్నాహం చేదాం.

కమ—అంత తొందర యెందుకు? సరియైన ఆలోచన యింకా కుదరలేదు. అసిగాక మా తల్లిదండ్రులికి తెలియజేయాలి.

జ—ఎందుకు?

కమ—ఇంత దూరప్రయాణం చేసేముందు వారి యనుమతి పుచ్చుకుంటే శ్రేయస్కరం. బయలుదేరేముందు వారి నక్కడికి పిలువనంపాలి.

జ—వారెంతమాత్రం ఒప్పుకోరు. అది మీరు కల్పిస్తూన్న మిష.

కమ—మిషలతో మన కేంపని. పూర్తిగా యిష్టం లేకపోతే తిన్నగానే చెప్పేసుందును. వారి అనుమతి మొదట కోరి, యివ్వనపుడు వేరుమార్గం ఆలోచించాలి.

జ—మీరు దృఢసంకల్పం చేస్తే యివన్నీ అడ్డుతాయా.

కమ—మీతో రావడం అంటే నాకూ యిష్టమే గాని—

(డాక్టరు రామమూర్తి ఎడమద్వారమువద్ద ప్రవేశించి అచ్చటనే నిలిచి)

డా—మీరుకూడా రావాలి, ప్రాక్టీసుకు యెవరూ లేరు (అని త్వరలో నిష్క్రమించును.)

(మొదట కమలమ్మ, ఆమె ననుసరించి జగన్మోహన్ కుడి పక్కనుండి యెడమద్వారము వంకకు పోవుదురు. రంగస్థలం మధ్యకు వచ్చు సరికి కొంచెము త్వరితగతితో మోహను కమలమ్మను చేర

బోయి ఆమెను కౌగిలింప దలంచి వెంచిన ట్లగపడుచూ తొట్రుపా టుతో ఆమె మెడపై వెనుకభాగమందు అంటీ అంటని ముద్దుపెట్టును కమలమ్మ చప్పున వెనుకకు తిరిగి చూచును)

క—అదేమిటి. (ఈమాటలు చెప్పుసరికి నరసింహం ప్రవేసించును. కొంచము తడబాటుతో చెదరిన చూపులుగల కమలమ్మ జగన్మోహనులను తేరిజూచును. ఎవరునూ మాట్లాడక ఒక్క నిముష మూగుదురు.)

న—మాసీను యీవాళ రిహార్సలు లేదు. కొంచం విశ్రమిస్తా. కమలమ్మగారూ మీరే ప్రాంప్టు చేయాలట. మూర్తిగారికి యింకెవరి చేతా నచ్చడం లేదు.

(కమలమ్మ అంగీకారము సూచించునట్లు తలయూచి యెడమ ద్వారం గుండా నిష్క్రమించును)

న—కూర్చోండి జగన్మోహన్‌గారు మీకాల మింకా సమీపించ లేదు.

జ—ఏమికాలం—ఇక్కడ ఊరకనే కూర్చోడం విసుగ్గా ఉంటుంది. ఆ రిహార్సల్ గొడవ చూస్తా మీకభ్యంతరం లేకపోతే.

(జగన్మోహను తల వంచుకొని కమలమ్మ పోయిన దారినే పోవును)

న—ఇచ్చట మరియొక నాటకం తయారగు తున్నట్టుంది. వీరి నడవడిక నాకేమీ అర్థం కాలేదు. అయినా తొందరపడి తీర్పుకు రాకూడదు.

(డాక్టరు రామమూర్తి ప్రవేశం)

డా—రిహార్సల్ మాటకేం గాని ఆకలి దహించుకు పోతూంది. యింతలో తేలేటట్టు లేదు. మీరూ అలసినట్టు కనపడుతున్నారు. ఎవరికీ తెలియకుండా కాఫీహోటలుకు జారి పది నిముషాల్లో

తిరిగి వచ్చేదాం రండి.

న—ఈసూత్రానికి దొంగతన మెందుకు మూర్తికి తెలిసిం దంటే చాలా నొచ్చుకొంటాడు. నౌకరికి చెపితే వాడే కాఫీ యిస్తాడు.

డా—నీ యిష్టం.

న—డాక్టరుగారూ మీరు మా మిత్రవర్గం లోనివారే. మూర్తికీ నాకూ యెంత ప్రాణస్నేహమో మీకు తెలుసును గదా. మీకెవ్వరైనా సలహాకొరకు రహస్యం చెపితే అదెక్కడికీ పోదని నాకు తెలుసును. అయినా యీ విషయంలో మరింత జాగ్రత అవసరం. కాబట్టి పరమ రహస్యంగా ఉంచాలని నా కోరిక.

డా—అలాగే కానివ్వండి.

నర—ఇప్పుడు—నేను—గదిలోకి వచ్చేసరికి వాళ్ళిద్దరూ—కమలామోహనులు—వింతస్థితిలో ఉన్నట్టు కనపడ్డారు. ఏదో విశేషం జరిగుండాలి. నన్ను చూచి కళవళపడి గడబిడైపోయారు. నాకు సరిగా అర్థం కావడంలేదు.

డా—కళ్లతో చూచినవారికి మీకే అర్థం కానప్పుడు నే నేమి చెప్ప గలను. ప్రతీదినం కోర్టులో అనేక వ్యవహారాలు నడిపిస్తూంటారు. బుద్ధిసూక్ష్మతకు యేమిటి లోటు.

నర—దానికేంగాని మూర్తినిగురించి నాకు చాలా ఆందోళంగా వుంది. ఇలాంటి ఉద్రేకాలు పెరిగితే అందర్నీ చుట్టుకుంటుంది. మనము స్నేహితులంకాబట్టి అతనికి నిజాన్ని తెలియపర్చి జాగ్రతపడమని హెచ్చరించవలసియుంటుంది.

డా—సరిగా అర్థం కాలేదని మీరే చెప్పేరు. ఏమీ లేందే తొందరగా ఊహాప్రవాహ సహాయాన్ని లేనిపోని అనుమానాలు తెచ్చి పెడుతున్నారు. మనం కలుగజేసుకోడం, యిలాంటి విషయాల్లో హానికే కారణం. అదిగాక చివరకు చెడ్డపోతాం.

నర—అలాంటి భయంవల్ల మన పవిత్రమైన విధిని మానడమూ. ఇది కేవలం పిరికితనం.

డా—ఏమి జేసినా మీ స్వబాధ్యతమీద చెయ్యండిగాని నన్ను మాత్రం యిందులో దింపకండి.

నర—మీరింత భయపడతా రనుకోలేదు. పూర్వులు నియమించిన కట్టుబాట్లను ధిక్కరించడంవల్ల ఫలిత మిది. అయినా మా శేషు నడిగితే కొంత మార్గం యేర్పాటు చేస్తుంది.

డా—ప్రపంచ మంతా వెల్లడి చేయించాలంటే అంతకంటే మంచి మార్గం లేదు. ఏకాంతంగా యీ సమస్యలని మీరు చర్చించ వచ్చు. రండి కాఫీ పుచ్చుకుందాం.

(ఇద్దరునూ లేచి యెడమ ద్వారముద్వారా లోనికి పోవుదురు.

రెండు నిముషములుతరువాత కమలమ్మ దీర్ఘాలోచనతో ప్రవేశించును. కుడివైపు సోఫాలో కూర్చుని ఆలోచించుచుండును.

జగన్మోహన్ యేమియు జరుగనట్టు ధైర్యముఖమును వహించి ప్రవేశించి యెదురుసోఫాపై కూర్చుండును.)

కమ—మీ వింతచర్యకు తగుసమాధానం యిప్పుడైనా చెప్తా రనుకొంటా.

జ—ఏమి టంత కోపదృష్టితో చూస్తూన్నారు. సమాధాన మెందుకు చీమతలకాయని యేనుగుతలకాయను చేస్తున్నారు. ఊరక హాస్యానికి.

క—నియమవిషయాల్లో యెంత చిన్న అక్రమణ అయినప్పటికీ గొప్పతప్పుగా భావించాలి. ఆవంత సందీయకూడదు. ఇందేమీ హాస్యంగా కనబడ్డం లేదు. అందులో స్త్రీని అనుమతిలేకుండా ముట్టుకోవడం చిన్న విషయమూ.

జ—ఒక చిన్నముద్దులో యేముంది. అనుమతి యిప్పుడీయకూడదా.

క—మన సంభాషణ హద్దు మీరుతున్నది. మీరు పశ్చాత్తాప పడుతారని మీతో యీ ప్రసంగానికి దిగేను కాని తిరిగీ చిల్లర ప్రణయంగా మారుస్తారని కాదు. దీన్ని పెంచడం వృథా—

జ—క్షమించండి, క్షమించండి. ఈ సాహసం దానికే మనస్నేహం పాడు చేయడమా. ఇకను తెలిసేలా చూడలేదు లెండి.

క—నా నడవడిక, అన్ని విషయాలు, అంతా చూడ తగినవే. దానికి అనవసరం. మీ చర్య నాకర్థమవటం లేదు.

జ—నిజము చెపుతాను. ఆ నిముషంలో అపరిమితమైన ఆపుకోలేని వాంఛ కలిగింది. నా మనస్సుయొక్క అనుమతి లేందే నా శరీరం అట్టి పని చేసింది. జరిగిన ఉత్తరక్షణం మేలుకున్నా. దానిని సర్దుపాటు చేయడం కోసం యింతవరకూ ప్రయత్నం చేసాను. సాగింది కాదు.

క—ఉద్రేకమైన వాంఛల వల్లే మనుష్యులు గొప్ప నేరాలు చేస్తారు. మీవంటి విద్యావంతులు యింద్రియనిగ్రహం ప్రత్యేకకృషి చేస్తారే.

జ—నాకు యీవిషయంలో విద్యాసహాయం ఉన్నట్టు తోచదు.

క—సరే, యింతటితోనైనా మన ఉభయులం కలసి యూరప్ దేశ సంచారము చేయడము కుతూహలం పోయిందా?

జ—దీనితో సంబంధం యేమిటి. అది నిశ్చయంగానే యిప్పటికీ తలుస్తా.

క—ఏమివింత. ఆ సంచారంలోని ప్రవర్తనకిది ఉపోద్ఘాతం కాబోలు. మన యిద్దరికథా చక్కని ప్రబంధంలాగ యింతవరకూ సాగింది. దానిని మీ ఉద్రేకంచేత నాశనం చేసారు.

జ—ఈ ఒక్క పొరపాటు క్షమించండి. దొరలలో అన్నలు తమ చెల్లెళ్లను ముద్దాడుకోరా. ఆవిధంగా తలంచరాదా.

క—అనుకోవచ్చు. కాని అది ప్రేమకారణంగా సమ్మతిని జరిగేది.

ఇప్పుడు మనం కాఫీకి పోవచ్చు.

జ——నన్ను క్షమించలేదే. మన పూర్వ స్నేహమైనా తలంచి తిరిగి మిత్రునిగా భావించమని నా కడపటి కోరిక. కొన్నాళ్లు పరీక్ష చేసిన తరువాత ప్రయాణవిషయమై ఆలోచించవచ్చు.

క——మానవ జీవితం పరిస్థితులవల్లనే కదా మారుతూ ఉంటుంది. ముందేమి రానున్నదో నే నూహించలేను. నామట్టుకు మీాయం దిప్పుడేమీా కోపంలేదు. ఇతర విషయాలేమీా తోచటంలేదు. నా భర్తకు తెలిస్తే యేమనునో, తెలియకుంటే యేలాగు (తటాలున లేచును యెడమద్వారము నంక పోవుచుండగా జగన్మోహన్ మారముగా అనుసరించును. వారిరువురూ నిష్క్రమించుచుండగా తెర)

సీను iii

(నరసింహాం యింట్లోగది. గోడలను క్యాలండరు బొమ్మలు, రెండు కేన్వాస్ కుర్చీలు, ఒకకర్రకుర్చీ ఎడమకుడిపక్కలను ద్వారములు. కుడివైపు వంటగది ద్వారమునుండివచ్చు పొగనుబట్టి ఊహించవచ్చును. ఎడమద్వారమునుండి నరసింహాం కోర్టు కాగితములు కట్ట పట్టుకొని ప్రవేసించును.)

న——శేషూ, శేషూ (శేషమ్మ కుడివైపు ద్వారమునుండి పట్టుపంచ మడిచీరగా కట్టుకొని ప్రవేశం.)

న——ఈవేళ నేను భోజనానికిరాను. టౌనుకిపోయి మొదట ఈపెద్ద ప్లీడరుకి కేసు చెప్పాలి. ఉదయమే శ్రమపడిలేచి అతనింటికి వెళితే యిప్పుడే ఆఫీసుకి పోయాడన్నారు. పొలోమంటూ అక్కడికి పోవాలి. భోం చేయడానికి యింకా వేళ కాలేదు. టౌనులో భోం చేస్తాను.

శే—మీకు సమయం చిక్కినప్పుడెల్లా యితరచోట్లనే భోం చేస్తారు. ఇంటి భోజనంకంటే హోటేలు భోజనం రుచి. నావంటంటే మరీ రుచితక్కువ.

న—ఎప్పుడూ యీలాంటి మాట్లాడతావు. బాగా చేసినప్పుడు మెచ్చుకొనేవాణ్ణి కాదా.

శే—సంవత్సరానికొకసారి. ఇప్పుడు పెద్ద ఫీడరుకి మీరు బోధించకపోతే కేసు తెలియదు కాబోలు.

న—అదంతా ఒకఫార్సు. మేము బోధించేదీ లేదూ, వాళ్ళుగ్రహించేదీ లేదు. పార్టీలను సంతోషపరచడానికి వాళ్ళ వెనకతిరిగి దీర్ఘాలోచన చేసినట్టు నటిస్తూ చేతు లెగరవేస్తూ ఒక్కొక్క విషయం చర్చించి ఖండించి పారేస్తాం. కోర్టులోకూడ పక్కనకూర్చుని తుమ్మెదలాగు వాళ్ళ చెవిలో కేసు జరిగినంతసేపూ ఘోషచేస్తూనే ఉంటాం. కొందరు సీనియర్లు జడ్జీలు వాళ్ళమీద పడినప్పుడు వెనక్కి తిరిగి మామీద పడతారు.

శే—ఎప్పుడూ తొందరపనులే అంటారు. సంపాదనేమీ కనపడదు. ఆ కమలమ్మగారికున్న హారంలాంటిది చేయిస్తానని మూడు సంవత్సరాలనుంచి చెపుతున్నారు. అంతే.

న—ప్లీడరీ అయిదు సంవత్సరాలనుంచేగా చేస్తున్నాను. అదింకా ఆరంభం అన్నమాటే. చిరకాల జీవికే యీ వృత్తి సదుపాయం. భట్టుమూర్తి వాళ్ళ బ్యాంకు తరఫున కొన్నికేసులు యిప్పిస్తానన్నాడు.

శే—ఏమిటీ! రిహార్సలు రోజున అంత ఆందోళనగా కనపడ్డారు?

న—ఆ విషయమై నీతో మాట్లాడ తలంచుకోలేదు. (కొంచమాగి) అయినా మొత్తుకున్నాం కాబట్టి—కమలమ్మ వ్యాపారం సవ్యంగా లేదని నా అభిప్రాయం.

శే—మీ అభిప్రాయంతో లెక్కేమిటి. సర్వంగా లేకపోవడం యేమిటి.

న—నే నొక చిన్న ప్రదర్శనం చూచాను. జగన్మోహన్‌కు ఆమెకు— ఏదో జరిగినట్టు నాకు నిశ్చయంగా తోస్తుంది.

శే—నే నేమీ నమ్మను. ఇలాంటి ప్రసంగాలు మానండి.

న—నాకుమాత్రం వారియందు స్నేహాభావాలు లేవనుకున్నావా. నిన్నేదో సలహా అడుగుదామనుకుంటే నన్ను నిందిస్తావేమిటి.

శే—లేని పోని అనుమానాలు తెచ్చిపెడుతున్నందుకు నిందించాలా, ఖండించాలి. ముఖ్యస్నేహితులం మనమే యిలాంటివి అంటే, యిక మనప్రవర్తన నచ్చని వాళ్ళేమైనా అంటారే.

న—ఏమో—ఈ స్త్రీ పురుషుల స్వేచ్ఛ సంచారం నాకేమీ మనస్కరించడంలేదు. ఇప్పటికైనా, కట్టిపెడితే బాగుంటుంది.

శే—నాకుమాత్రం యీ విపరీతార్థాలు తోచా, కాని యీవిషయం మన స్నేహితుల గౌరవవిషయం. మనము చేయవలసినపని స్పష్టమే. లోకోపవాదాలకి యెడం యివ్వకుండా యిప్పుడే నశింపచేయాలి.

న—కాని యీవిషయం మూర్తి చెవినిగాని, కంటగాని పడితే—

శే—ఏమయింది? పద్దాన్కి పడినా సమర్థించుకొనే శక్తి గలవాడు. అయినా మీ యనుమానం వెర్రి. జగన్మోహన్ పాశ్చాత్య దేశాల స్వతంత్రానికి అలవాటు పడినవాడు కాబట్టి విద్యావంతురాలైన కమలతో కొంత విచ్చలవిడిగా తిరుగవచ్చు. అందులో తప్పేమిటి.

నర—నామాట విను. వీణ వినడం మిషతోను, నాటకాలకి ప్రదర్శనాలకి పోవడంకొరకు, యితర సంభాషణలకు, జగన్మోహన్ ప్రతీ రోజూ మూర్తి యింటికి వెళ్ళడం; తరచు అక్కడ భోజనం, టీ,

వగైరాలు; మూర్తి శేషగ్రహకుకాక వాళ్ళిద్దరూ కలిసి బీచికి వెళ్ళడం; కమలాంబ మోహనా ఇంగ్లండుకి వెళితే కమలమ్మ ఆయనకూడా వెళుతుందని వదంతిగా ఉండడం. ఈ విషయా లన్నీ లోకవిపరీతం అయిపోయినాయి.

శే—లోకుల అభిప్రాయాన్ని లెక్కచేసిందేగాని మన లోపం లేనప్పుడు వెరవడం యెందుకు?

నర—అన్నిటికంటే ఇంకొకటి చిన్న విశేషం జరుగుతూన్నప్పుడు వాళ్ళిద్దరూ డ్రాయింగురూములో ఉన్నారు. నేనలా వెళ్ళేసరికి గదిమధ్యను నిల్చొని ఉన్నారు. లేవస్తూలివారె అనుకోకపడి కంగారు చూపులతో మనోవైకల్యాన్ని వెల్లడిచేశారు. దాంతో నాకు గొప్ప అనుమానం పట్టుకుంది.

శే—అవినీతికార్యాలు కది సమయంగాదు. అదీగాక గదిమధ్య నిల్చొని మీకొరకు ప్రదర్శించడ మెందుకు—అన్ని సోఫా లుండగా. దోషమున్నా ఒక్కరిదే అయి ఉండాలి. సాధారణంగా పురుషుడేగా యీ విషయాల్లో మొదటి దోషి.

నర—ప్రబంధాల్లో ఆపని స్త్రీకే నియమించారు. అయినా మన మూరుకోకూడదు. మూర్తిని మేలుకొల్పాలి. జాగుచేస్తే కొంప మునుగవచ్చు.

శే—మీ రిందులో యేమీ కలుగచేసుకోవద్దు. కొంప మునిగే దేమిటో నాకు కన్పడడం లేదు. మూర్తిగారికి నేనంటే చాలా గౌరవం. సమయానుకూలంగా నేను రాయబారం నడుపుతాను. మీరు పూర్వంవలెనే సంచరిస్తూవుండండి.

నర—నేనంటే నీ కెప్పు డూచులకనే. నే జేయవలసిన పని చేసాను వేళైంది. పోతాను. (కుర్చీనుండి లేచి పక్కను తగిలించిఉన్న తల పాగాను తీసి ధరించును.)

శే—ఇంతకంటే చెడుచేసి ఉందురు. రాత్రి భోజనానికి వస్తారా ?

నర—ఆభోజనం ఉండమంటా వేమిటి. నీకంత కష్టమైతే హోటేలులో భోంచేస్తానులే.

శే—నా కాడబ్బిస్తే మంచి వంటకాలు చెయ్యనా. సరే వేగిరం రండి.

నర—ఏదీ చిన్న ముద్దు.

శే—వేళాపాళా లేకుండా సరసం. నూతన విధానాలు వినియోగం లోనిక్కి తెస్తున్నారు. వెళ్ళండి. (నరసింహాం చేతితో ముద్దు విసరి యెడమద్వారముగుండా నిష్క్రమణ. శేషమ్మ వంటయింటిలోనికి పోవును. ఒక నిముష మైనతరువాత భట్టుమూర్తి యింటి దుస్తులతో చదరిన కురులతో యెడమద్వారమునుండి ప్రవేశించును)

భ—నరసింహాం—నరసింహాం. శేషమ్మగారు (వంటగదినుండి "యెవరది" అని విన నగును. వెంటనే శేషమ్మ యెడమద్వారమునుండి ప్రవేశించును.)

భ—నరసింహాం యింకా రాలేదే.

శే—కూర్చోండి. ఈవేళ భోంచేయకుండానే పెద్ద ప్లీడరు ఆఫీసుకు వెళ్ళేరు. పట్నంలోనే భోంచేసి కోర్టుకు వెళతారు.

భ—అతను లేకపోవడం మంచిదే మీతో నా స్వవిషయం మాట్లాడదామని వచ్చేను. (కొంచ మూగి) శేషమ్మగారూ మా యింట్లో కొత్తగా పుట్టిన కలకలం వినేయుంటారు. నరసింహాం సూచనగా తనతో చెప్పినట్టు డాక్టరురామమూర్తిగారు నాతో చెప్పేరు. అందుపై నేనా సోదరీసమానురాలైన మీవద్ద నా హృదయం విప్పి కొంచం ధైర్యం తెచ్చుకుందామని వచ్చాను.

శే—ఇటువంటి అసూయపుకల్పనలకు ఆందోళన పడడ మెందుకు ? మీవంటివారికికూడా యింత మనోధైర్యం లేకపోవడమా.

భ—స్వవిషయం వచ్చేసరికి గ్రంథాల్లో చదువుకున్న నీతివాక్యాలు

యితరులకు బోధించే ధర్మసూత్రాలు సహాయపడవు. నాకు పుట్టిన వ్యాధి సామాన్యమైనది కాదు. ఎంత ప్రయత్నం చేసినా యీ ప్రణయ అసూయప్రబీజాలు నా మనస్సులో మొలకలెత్త మానడంలేదు. ఏమి జరిగినా నా జీవితధనమైన యీ ప్రేమను మలినము చేయకూడదు. ఎంత విపత్తు సంభవించినా నా కమల మీాది అనురాగం తగ్గకూడదు. దాని పవిత్రత చెడరాదు.

శే—కమలమ్మ ప్రవర్తనయందు యిసుమంత కళంక ముందంటే నే నమ్మను. మీా రట్టి తలపులకు తా వీయకూడదు.

భ—నా కటువంటి తలంపు కలలోనైనా లేదు. నే నేమైనా సందేహ పడతానేమో యని తా ననుకోవచ్చునితప్ప.

శే—అయితే మీా కిపుడు వచ్చిన చిక్కేమిటి. లోకు లేమైనా చెడ్డ మాటలు ప్రచారణ చేస్తారనా.

భ—లోకులమాటకు వీసమంత లెక్క చేసేవాణ్ని కాను. ఒకరికి నష్టం కలుగచేయకుండా బాధించకుండా సంచరించాలి. అంతే ఇతర జీవిత స్వేచ్ఛకి భంగం కలుగనివ్వరాదు.

శే—అందుకు నే నంగీకరించను. లోకాభిప్రాయాన్నిబట్టే మన మర్యాద, కీర్తి పరిణమిస్తాయి.

భ—లోకోభిన్నరుచి—అనేక విధాలు కాబట్టి యెవర్ని సంతోష పెట్టడమో తెలియదు. తరవాత—మనం సరియైన దారినే అనుస రిస్తుంటే మొదట పోరబడినా చివరకు లోకమే గ్రహించాలి. గ్రహించకపోతే వారిదే ఆ శక్తి లోపము.

శేష—ఆదారి సరియైనదా కాదా అనడానికి యేమిటి ప్రమాణం.

భ—మన అంతరాత్మ.

శే—అయితే ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క అంతరాత్మ ఉండ నను.

భ—అది ప్రకృతివిరుద్ధం. అందుచేత మనుష్యులకీ జీవసార మొక్కటే. మనం తప్పుదారిని మనసార తొక్కినప్పటికీ అంతరాత్మ తప్పని బోధిస్తూనే ఉంటుంది. కొంచెమాగి; యిప్పుడు జగన్మోహన్ మా ప్రేమకు కొంత కలత తెచ్చాడని నాకు అసూయ పుట్టింది. అట్టి చిత్తరీణి తప్పని నాయిచ్ఛాశక్తివల్ల దానిని జయించాను—కాని నిజంగా కమలం అతన్ని ప్రేమిస్తే అప్పుడేమిటి. కమల మోసపుచ్చే దుష్ప్రవర్తనకు తగే నిజమైన్య క్తికాదు. అది ముమ్మాటికి నిశ్చయం. తనకు తెలియకనే ప్రేమ మొలకలు పుట్టియుండవచ్చు. అప్పుడేమి చెయ్యాను—శేషమ్మగారూ.

శే—ఇదియేమివింత! కులస్త్రీ పరపురుషుల్ని ప్రేమించడమా. ఘోరపాతకమే. అట్టి దాన్ని యేమి చేసినా పాపంలేదు. దీనిలో అభిప్రాయభేదానికి సందులేదు.

భ—ఇదిమా మీరుచేసే సహాయం. ప్రేమ మనస్సుకు ఆత్మకు సంభందించినది. బాహ్య ప్రవర్తనలో మా ర్పేమియు లేక పోవచ్చును. కాని ప్రేమ లేని శరీర సంబంధం నీతిభద్రమైన యేమి ప్రయోజనం.

శే—మూర్తిగారూ! మీరు చేప్పేదంతా బాగానే ఉంటుంది. కాని నాకు చాలవరకూ అర్థం కాలేదు. ఆచరణలోకి యేలా తెస్తారో తెలియడంలేదు.

భ—ఏది యెట్లున్నా కమలంమీద మీకింత గౌరవమున్నందుకు కృతార్థుడను. డాక్టరునాతో ముచ్చటించి నప్పటినుంచీ నాస్నేహితులు యీవిధంగా తలంతురా అని విచారపడ్డాను. మీరుమాత్రం నాకు సానుభూతిచూపి నాసంతాపం కొంచెం తగ్గించేరు. మిగిలింది పరిస్థితుల నడతనుబట్టి యేర్పడుతుంది.

శే—మూర్తిగారూ—మీ యిరువురి స్నేహంవల్ల మా జీవితాని

కింత ఆనందం లభించింది. మీవంటి త్యాగం చూస్తే నామనస్సు నీరై పోతుంది. ఏమిచేయమంటే అది చేస్తాను. ఇది మీ స్వగృహంగా భావించి మీయిష్టం వచ్చినట్టు నన్ను వినియోగించండి.

భ—మీరు వందనీయులు. ఇట్టి స్నేహితులుండగా నాకేమి కొదువ. పోయివస్తా. శనివారం మాయింటికి మా కులాలుగా భోజనానికి వస్తారుకదా. (వచ్చినదారిని నిష్క్రమించుచుండగా శేషమ్మ తల యూచును. తరువాత ఆలోచనా నిమగ్నయై కూర్చొనియుండును. రెండుమూడు నిముషములు తరువాత నుండి "మిస్టర్ నరసింహం మిస్టర్ నరసింహం" అను కేక వినబడును.)

శే—(ఉలికిపడిలేచి) జగన్మోహను కంఠం. ఈదినం మాయిల్లు నాటక రంగస్థలంలాగ ఉంది. ప్రధానపాత్రను నేనే (జగన్మోహన్ యెడమ ద్వారంవద్ద ప్రవేశించి ద్వారమువద్దనే నిలచి)

జ—మిస్టర్ నరసింహం—మిస్టర్ నరసింహం.

శే—(కుర్చీనుండిలేచి) లోనికిరండి కోర్టువేళలో ఆయన యింట్లో ఉంటారా. తెలిసి ఆయన్నెందుకు పిలువడం.

జ—(ముందుకువచ్చి) ఆడువారిని పేరుపెట్టి వీధిలోనుంచి పిలువడం మనలో ఆచారంలేదు గాబట్టి ఆలాగు పిలిచాను.

శే—మన ఆచారాలమీద బొత్తిగా అభిమానం పోలేదు సంతోషమే. వాటిని నాశనంచేయడానికి కంకణం కట్టుకొన్నారుగదా కూర్చోండి. (జగన్మోహన్—కాన్వాసు కుర్చీపై కూర్చుండును. తరువాత యెదురుగా కర్రకుర్చీమీద శేషమ్మ కూర్చుండును.)

జ—మీతో మాట్లాడ్డానికే వచ్చాను. మీనుంచి అభిప్రాయం గడిద్దామనే.

శే—స్థితిగతులు యేల్లాగున్నాయో తెలిసికోడానికా. ఇక్కడేముంది.

జ—శేషమ్మగారూ. నామనస్సు ఆందోళనపడుతూంది. మా అంద

వకూ మీరు ప్రేమ సలహాలనిచ్చి కష్టాలు తొలగిస్తూంటారు. నన్ను కూడా మీ మిత్రునిగ భావించమని నాకోరిక.

శే—సహోమీద నడవడం ప్రేమకాచారం కాదు.

జ—నా ఊహని పెడత్రోవలో పెడుతున్నారు.

శే—మీరు సరియైన మార్గాన్ని అనుసరించి ఉంటే నామాటలు తిన్నగానే కనపడును. మీ తలంపులే మిమ్మల్ని భాదిస్తున్నట్లు న్నాయి.

జ—నేను నిర్దోషినని చెప్పను కాని పరిస్థితులయొక్క పై మాపునుబట్టి పవిత్రునుగు స్నేహితుల్ని అపూయమాటలచే నొప్పించగాదు.

శే—వసంతులు కలుగడానికి మీరే కారకులు. వాటిని ఉపశమించ డానికి శీఘ్రంగా మీరే పూనుకోవాలి.

జ—మూర్తి నన్ను మృగప్రాయుణ్నిగా చూస్తున్నారు కాబోలు. ఇప్పటి అతని మనోస్థితి తెలిసికోడానికి యేమైనా యివ్వగలను.

శే—రచించిన నాటక ప్రదర్శనం చూడ్డపు కుతూహాలం సహాజమే. కాని అది అందరికీ సమకూడ్డం అరుదు. మన దేశంలో మరిన్ని.

జ—నా అవస్థ మీకు వినోదంగా ఉంది. అయినప్పటికీ మీరు చెప్పి నట్టు నడుచుకోడానికి సిద్ధంగా ఉన్నాను. కరుణించాలి.

శే—ఇప్పటికి మీ దురాకర్షనంచాగ ప్రయత్నాలు కట్టిపెట్టండి. ఇలాంటి మతాలు కమలమ్మగారికి బోధించకండి.

జ—బలవంత మేమీ లేదే. ఆమె కిష్టమైతేనే.

శే—మొదట మూర్తిగారితోనే ఆ విషయం చెపితే బాగా ఉండేది. ఆయనమాత్రం ఆమె స్వేచ్ఛకు భంగకరంగా యెప్పుడైనా నడి చారా. లోకుల నోరు కట్టుపడేది.

జ—లోకుల కట్టుబాట్లని ధిక్కరించేవార్ని యేలాగైనా నొప్పించి అణగగొట్ట ప్రయత్నిస్తారు.

శే—మనం స్నేహాన్ని హార్దుక్యం కాంచినప్పుడు లోకాన్నెందుకు నిందించడం.

జ—మీరు నన్ను నిందించినా నాకు కోపంలేదు. ఇప్పుడు నా సంకల్పం మూర్తి కిసుమంత ప్రేమకు యేవిధమైన కళంకం లేకుండా చెయ్యడమే. వీలైతే వారితో స్నేహాన్ని కాపాడుకొంటూ అవసరమైతే ఆ స్నేహాన్ని కూడా వదులుకుంటా.

శే—మీరాయనకిచ్చే శ్రేయస్కరము కోరి నే నాడిన మాటలు మనస్సులో పెట్టుకోండి. మీ సద్గుణం నా కిప్పుడు గోచరించింది. సమయానుకూలంగా మీ సంకల్పసిద్ధికోసం ప్రయత్నించండి. కథాంతానికి విచారించ నవసరం లేదు.

జ—ఈ ప్రయత్నంలో మీరుకూడా సహాయపడి మూర్తికి నచ్చచెప్పాలి.

శే—మూర్తిగారికి నే చెప్పవలసినదేమీలేదు. ఆయనకున్న సహనం, యింద్రియనిగ్రహం వర్ణించతగినవి. పుణ్యపురుషుడు. మీవల్ల తప్పున్నా క్షమించి తిరిగి ఆదరించును.

జ—కృతార్థుడని ఇప్పుడు నే చేయవలసినది మనస్సుకు కొంచం స్ఫురిస్తోంది శెలవు. మూర్తిగారి యింట శనివారం విందులో కలుసుకుందాం.

(తొందరగా వచ్చినదారినే నిష్క్రమించును. అతను పోవు చుండగా తెర)

## సీను iv

(భట్టుమూర్తి యింటివెనుక తోట. శృంగారమైన క్రోటన్లు, పూలచెట్లు, పొదలు, లతాగృహములు, రెండు చిన్నబల్లలు, అరుగు

నిటు కుర్చీలు, కమలమ్మ డాక్టరురామమూర్తి మెల్లగా కుడివైపు నుండి ప్రవేశించి షికారు చేయునట్లు బల్లల వెనుకకు పోవుదురు.)

డా—నిన్న పడిన ఒక వర్షంతో తోటంతా ప్రణయనియగు స్త్రీలాగు అలంకరించుకొన్న ట్లగుపడుతుంది.

కమ—ఈ చల్లదనంపై నేనా మనస్సుకు శాంతి నివ్వలేదుకదా. నా జీవితాన్ని ఓర్వలేమి అనే అగ్నితో మంట పెట్టకుర్యాలని చూస్తున్నారు నా స్నేహితులుకూడాను. ఈలాంటి లోకము యొక్క అభిప్రాయం నన్నింతగా నొప్పించగలదని నే నెన్న డనుకోలేదు.

డా—దీ నంతటి కీ కారణం నే ననుకుంటూ. నాకూ నరసింహానికి జరిగిన సంభాషణ మీాకు తెలిస్తే మంచిదని చెప్పేనుకాని యీా విధంగా మనస్సు కలవరపర్చుకుంటూ రనుకోలేదు.

కమ—అది మీారు చెప్పకపోతే మరింత కలవరపడి ఉందును. నాతో మాట్లాడినట్లు స్నేహితుల ప్రవర్తన గుర్తెరుగలేనా. నిన్నటి రోజున బీచిని కూర్చున్నప్పుడు బారిస్టరు వెంకట్రావుభార్య నన్ను చూడనట్టు నటించి పక్కనుంచి నడిచి వెళ్ళింది.

డా—అవన్నీ మీా ఊహాలు. మీా భర్తగారు మీాయెడల యెప్పటి వలెనే సంచరిస్తున్నారు. ఆయన్ని యెవరూ మార్చలేరు, చెరుప లేరు.

కమ—ఆ విషయమే నన్నింత కలతపెడుతూంది. మాటలవల్లగాని, ప్రవర్తనలవల్లగాని, యేమీా చేస్తారనిగాదు. ఆయనది సున్నితమైన మనస్సు. నాతో యీావిషయం ప్రసంగించకపోవడమే నన్ను దహించేస్తూంది.

డా—అలాంటి ప్రసంగం మీా స్వేచ్ఛకు భంగకరమని ఊరకున్నారు.

కమ—మీారు యెన్ని సర్ది చెప్పినా మనస్సు ఊరడిల్లదు. ఇది నాకు

పరీక్షసమయం కాబట్టి ఆయనకుకూడా పరీక్షసమయమే. విూ రింట్లోకి వెళ్ళి ఫలహారాలు సిద్ధం చేయించండి. వారంతా వచ్చే సరికి ఒక గంట కావచ్చు. మూర్తిగారింకా రాలేదు కాబోలు.

డా—ఈసరికి వచ్చుంటారు. తోటలో మిమ్ముల్ని కలిసికోమని చెప్పనా.

కమ—చెప్పడ మెందుకు—ఆయనే వస్తారు. (డాక్టరు రామమూర్తి వచ్చినదారినే పోవును. కమలమ్మ ఒక పూవును కోసి పరిమళ మాఘ్రాణించి మెల్లగా నడిచి ఒక కుర్చీమీద కూర్చుండును. మెల్లమెల్లగా పువ్వును చిదిమి క్రింద పారవేయును. భట్టుమూర్తి కుడివైపునుండి ప్రవేశించి ఆమెవద్దకు పోవును.)

భ—ప్రియుని రాకకోసం యెదురు చూస్తూన్నపుడు యీ విచారావస్థెందుకు.

కమ—(లేచి నిల్చొని) ఇప్పుడు నా ప్రియు డెవరో తెలియక ఆలోచిస్తున్నా.

భ—ఆలోచనవల్ల తేలే విషయం కాదే. హృదయపరీక్షవల్ల తెలిసిపోతుంది.

కమ—స్వేచ్ఛావాతావరణంలోనే అట్టి హృదయాలు వికసిస్తాయి. మన బానిసత్వపుజీవితంలో వస్తువుల గుణభేదాలు గ్రహించడం కష్టం.

భ—నీ జీవితంలో స్వేచ్ఛ కేమిలోటు.

కమ—అదంతా పై విషయాల్లోనే. ముఖ్యవిషయాల్లో లోకంలో బానిసత్వం మనని ఆవరించింది. పై నడవడికనుగురించికూడా లోకం దుర్భాష లాడుమన్నారు. మీ రేమీ కలుగజేసుకోకుండా చూస్తున్నారు.

భ—వాటి నెప్పుడూ తలపెట్టలేదు.

కమ—లోకమంతా నన్ను నిందిస్తుంటే [illegible] నేనే తెలిసి తెచ్చుకొని పాతివ్రత్యధర్మాన్ని విధివిలంగా అనుసరిస్తానని.

భ—ఆ ధర్మం నీకు నచ్చలేదని నే చెప్ప ఒప్పుకోలేను.

కమ—హృదయాన్ని నా కిష్టం వచ్చినవారి కివ్వడానికి నాకు హక్కు లేదా.

భ—ప్రతి వ్యక్తికీ ఆ స్వేచ్ఛ ఉండాలనియే నీ కనేకసార్లు భోధించాను. అది లేకపోవడంవల్ల మన వివాహాలు ఆర్యసమ్మతం కావు.

కమ—అయితే తల్లిదండ్రులకి తమ బిడ్డలను నా రిష్టమైనవారి కిచ్చి వివాహం చేయడం ఆచారమైనప్పటికీ నీతిదాయకం కాదు.

భ—అదియే నా అభిప్రాయం.

కమ—మన వివాహానికిమాత్రం అట్టి స్వేచ్ఛ యేది.

భ—మన వివాహమా. (ఆశ్చర్యమును తెలుపును) మన పరిస్థితులనుబట్టి స్త్రీలకు అట్టి స్వేచ్ఛ కలగడానికి యెంతమాత్రం వీలు లేకపోయినా నేనుమాత్రం యిష్టపడే నిన్ను వరించాను.

కమ—అట్టి వివాహం నన్ను యేవిధంగా బంధిస్తుంది. నే నెన్నడూ మిమ్ముల్ని వివాహానికిపూర్వం చూడనైనా లేదే. మీరు తెలియజేసిన నీతిప్రకారం నేను మిమ్ముల్ని భర్తగా ఊహించ నవసరం లేదు.

భ—మన యీ పవిత్రమైన ప్రేమను యీవిధంగానా మలినం చేయడం. వివాహం అయినతరువాత మనం సంపూర్ణంగా ప్రేమించుచుండలేదా. నా జీవితమంతా నీ విద్యావిషయమై నీ వినోదాలకు వినియోగించలేదా. అది నానాటికి పెరిగి విజృంభించింది. నే చెప్పేమాటలకు మన యీ ఐదుసంవత్సరాల వివాహజీవితమే ప్రమాణం.

కమ—మనస్సుకు సందేహం రాకుంటే యెన్నాళ్లైనా గడుపవచ్చును.

మీకు నా కష్టసమయ విద్యాప్రదానానికి, నాగరికతకు ఎప్పుడూ కృతజ్ఞురాలనే. నా జీవితమంతా సమర్పించినా మీ ఋణం తీర్చ లేను.

భ—నే కోరేది నీ ప్రేమే కదా. మనస్ఫూర్తిగా ఇచ్చిన ప్రేమ.

కమ—ఆవిధంగా ప్రేమ స్వేచ్ఛాగమనాన్ని బంధించగలదా. మొదట స్వతంత్రంగా యేర్పాటు కాబడని వివాహం సంపతు లిద్దరూ విశ్వప్రయత్నాలు చేసినా ఆ తొలి లోపం పోగొట్టలేరు. ఈ ఆటంకం మిమ్మల్నే బాధించదు. మీరు స్వతంత్రంగానే యింటిలో ప్రవేశించారు.

భ—ఎన్నడూ లేని యీ కష్టపుమాట లాడ్డానికి యేమిటి కారణం. నిన్నే విషయంలోనైనా నిర్బంధించలేదే. మొదట నీకు స్వేచ్ఛ లేకపోవడానికి నే నేం చేయగలను.

కమ—నిర్బంధన లేకపోబట్టే కన్నులు తెరవడానికి నాకు వీలు కలిగింది. కొంత స్వేచ్ఛ లభిస్తే పూర్తిగా పొందుదామనే కుతూహలం మనుష్యు లందరికీ ఉంటుంది. ఇప్పుడు యీ సమస్య పైకి రావడానికి కారణం మీకు తెలిసినదే.

భ—నా కేమీ స్ఫుటంగా తెలియడంలేదు.

కమ—నేను జగన్మోహన్‌గారితో స్నేహంగా ఉండడం మీస్నేహితు లందరికీ కష్టంగా ఉంది. మీరుకూడా విధిలేక ఓర్చియున్నారు. ఈ స్నేహం యేవిధంగా పరిణమిస్తుందో అని ప్రతినిముషం భయపడుతున్నారు.

భ—ఊహాప్రవాహం నిరాటంకంగా పోనిస్తున్నావు. కాని మీ స్నేహవిషయమై నా కేట్టిచింతా లేదు. లోకుల అపవాదలను చెవి బెట్టనని నీకే తెలుసును.

కమ—ముందేమి జరుగునోయని శంక మీ కుంది. నరసింహంగారి

యింట్లో జరుగుతున్న సభల పరియవసానం ఆచోకీగా నాకూ తెలిసింది. అదిగాక నాతో ప్రసంగించకుండా మన రహస్యవృత్తాంతాలు మీ స్నేహితులతో తర్కించడం ప్రేమకు కళంకమే.

భ—నీకు కష్టం కలుగచేయడం యిష్టంలేక నీ శ్వేచ్ఛకు ఆటంకం రాకుండా ఉండడానికే యెన్నడూ యీ హాంశం నీతో ముచ్చడించలేదు. వేరొకటేమీ కాదు. శేషమ్మగారితో మాత్రం ఆమె అభిప్రాయం తెలిసికోడానికి ప్రసంగించేను. మనస్సు కలవరపడి నప్పుడు స్నేహితులవద్ద వెడలపుచ్చుకోవడం శాంతిదాయకమే కదా.

క—నామనస్సు కలవరపడి ఆత్మపరీక్ష చేసుకుంటే నాప్రేమ శ్వేచ్ఛలోపుటలేదు. కాబట్టి పవిత్రమైంగికాదని తోచింది. స్నేహితుల గుసగుసలు, సంకిళ్లు తెంచుకుందామనే సంకల్పాన్ని దృఢపరిచింది. ఇలాంటిమాటలు మీకెంత కష్టమో నాకు తెలుసును. ఇది నియమితం. కష్టాలనుండి పైకి వచ్చేటే జీవితానందం.

భ—ఇంతవరకూ నీభావం నా కగోచరంగాఉంది. నీవేమి చెయ్యమన్నా చేస్తాను. ఈసందేహాప్పుటవస్తలోనుంచి మాత్రం వేగిరం తప్పించు.

క—నాహృదయాన్ని నాయిష్టంవచ్చినచోట అర్పించుకోడానికి నాకు స్వతంత్రం యివ్వమని నాప్రార్థన. అది నాహక్కని మీకు తెలియజేయడానికి ప్రయత్నిస్తున్నాను.

భ—నాయందు ప్రేమతొలగిపోయింది. స్వతంత్రం నే నిచ్చేదేమిటి. అపుడే నీ హృదయం మరొకని కర్పించేసి యీమాటలవల్ల నన్నుకొంత శాంతి పరచచూస్తున్నావు. నే ననుకున్నట్టే జరిగింది. సంస్కరణ విషయాల్లో ముందడుగు వేసేవారు యెన్నికష్టాలైనా అనుభవించ వలసిందే.

క—నాయిష్టం వచ్చిన వారిని ప్రేమించడం నా ప్రకృతి ధర్మమే. సంఘం యెన్నికట్టుబాట్లు చేసినా దాన్ని ఆపగలదా. మీరు చెప్పినట్టు అప్పుడే యింకొకరి వంక నా హృదయం మరలించనుకోండి. అందులో తప్పేమి. మిముల్ని మోసపుచ్చలేదే. మిముల్ని ఒడబరచి—అప్పుడే అర్పిస్తాను.

భ—శరీర సంభంధమైన వ్యామోహాన్ని ప్రేమని అనుకుంటున్నావు. పవిత్రమైన వివాహంవల్ల మనం కట్టుపడ్డాం కాబట్టి దాని నీతులను అనుసరించాలి. మన యిచ్ఛలకది ఆటంకమైనా సహించి జీవితాన్ని గడపాలి. అందులో మన జీవితం మన నడవడికవల్ల మరింత పవిత్రం చేసుకొని విజ్ఞాన పూరితమైన వాతావరణంలో యిమిడ్చేం. అట్టిదానిని యింతచులకనగా చూచి యేదో స్వేచ్ఛపేరు బెట్టి నాశనం చేయాలని తలస్తున్నావు. అట్టితలంపులు విడువమని నాయందున్న గౌరవాన్నిబట్టి మనపూర్వ ప్రేమనుబట్టి వేడుకుంటున్నాను.

క—మీమాటలకు పూర్వాచార పరాయణుడైన ప్రోత్రీయుని భావాలకి యేమీ భేదం కనబడదు. మీకు స్వేచ్ఛంటే అర్థంలేని ఉత్త మాట. సంభాషణలోను, ఉపన్యాసాలలోను గంభీరంగా ప్రసంగించడానికి ఒక సావకాశం. తలిదండ్రులచే చేయబడ్డ ప్రతివివాహానికి మీ నీతులు అనువర్తిస్తాయి. ఎట్టి ప్రతికూలహృదయులైన దంపతులనైనా బంధిస్తాయి. మన జీవితంలోగాని వివాహంలోగాని ఉన్న విశేషాంశం నాకేమి కనపడదు. ఎంతసేపూ పురుషుడు తన సుఖాన్ని ఆసించుకొంటూ దానికి అనుగుణంగా ఉండే తెరువు నీతిదాయకమని బోధిస్తారు. మీరూ అంతే. మీ బాహుళ్య దృష్టి యిపుడు స్పష్టపడింది.

భ—నీయందుండే ప్రేమవల్ల గౌరవంవల్ల నీ సుఖాన్ని మనసార

కోరి యీవిధంగా చెప్పేను, కాని నా సుఖాన్ని కోరుకోలేదు. అది నిజం. ఇక నేనీసంభాషణ పొడిగించిన కార్యంలేదు. నీ యిష్టం వచ్చినట్లు చేయవచ్చును. నా పేరిమమాత్రం చెలింపనీయను.

కమ—నే కోరితే నా కివ్వవలయును. నా స్వేచ్ఛ.

భ—జగన్మోహన్ ప్రేమించడానికా ?

కమ—అయితే కావచ్చును. ముందు నాకు స్వేచ్ఛ నిచ్చినతరువాత నా హృదయాన్ని యెవరి కర్పించడమో, లేక ఒంటరిగా సన్యాసినై వనములు గడపడమో అలోచిస్తా.

భ—మనకే బిడ్డలుంటే యిలాంటి విశేషాలు పుట్టియుండవు— అయినా, నీవు కోరినట్లు నీ హృదయస్వేచ్ఛ మనసార యిస్తున్నాను. నీవు సుఖించడమే నా మనస్సమ్మతం.

కమ—ఇప్పుడుగదా మీ విమణీయమైన గుణాన్ని ప్రదర్శించారు. నా గుండెమీదనుండి పెద్ద రాయి తొలగిపోయింది. ఇప్పుడు కొత్త గాలి పీలుస్తున్నాను. ప్రకృతి నూతనవేషంతో ఉన్నట్లు కనపడుతూ ఉంది. ఈతోటలో యిదివరకెన్నడూ చూడని వింత సౌందర్యం యిప్పుడు కనపడుతూంది. కొంతసేపు తోటలో తిరిగి వస్తాను. (కమలమ్మ భట్టుమూర్తి యేమనునో వినకుండానే యెడమవైపుకు తొందరగా పోవును. డాక్టరు రామమూర్తి కుడి ప్రక్కనుండి ప్రవేశించును.)

డా—ఏమిటి మూర్తిగారూ దీర్ఘాలోచన చేస్తున్నారు.

భ—నా జీవితం అంధకారమైంది. నా చేతలన్ని నిష్ఫలం అయినాయి. ఆశలన్నీ నిరాశలైనాయి. ఆనందం, సుఖం దూరమైనాయి. ఇన్ని ఒక్క నిముషంలో వచ్చి ముంచేసేయి.

డా—ఏమిజరిగింది—ఏమిజరిగింది ? నా ప్రాణం అడ్డువేస్తాను.

భ—నా ప్రాణం నన్ను విడిచి ఇతరుల నాశ్రయించడానికి వెళ్ళిపోయింది. నేను ప్రాణపదంగా పెంచిన నాకమలం తన హృదయాన్ని నా స్వాధీనంనుంచి తప్పించుకొని ఎగిరిపోయింది. ఆచిత్తవృత్తి మరల్చడానికి అనురూపమైన ఉపాయం తోచింది కాదు.

డా—కోపము దిగమింగండి. అదిగో నరసింహాం దంపతులు వస్తున్నారు. కొంచెం సమర్థించుకోవాలి. కష్టసమయంలోకదా యింద్రియ నిగ్రహం బయలు పడుతుంది.

(నరసింహాం శేషమ్మ కుడివైపునుండి ప్రవేశించెదరు.)

న—మేము రావడం కొంచెం ఆలస్యమైంది. ఇతర స్నేహితులెవ్వరూ రాలేదే.

డా—ఈరోజున చిన్న కుటుంబ కూడికవంటిది. కమలమ్మగారు మిమ్మలనీ జగన్మోహన్‌గారిని మాత్రం పిలవమన్నారు. నాకూ యిదే బాగుంది. పెద్ద సమూహమైతే యీవిందుల కలవడి చెడుతుంది. అప్పుడు ఫలహారాలు పుచ్చుకోవడమే ప్రధానకార్యమౌతుంది.

న—తోట యీరోజున చాలా యింపుగా ఉంది. ఏమి మూర్తీ మౌనముద్ర వేశావు. రండి మోహన్ వచ్చేలోగా కొంత విహారం సాగిద్దాం.

భ—నాకొక్కడికే యీతోట అందం మాటువడింది.

డా—రండి మూర్తిగారూ.

శే—నేను మాత్రం యిక్కడే కూర్చుంటాను.

న—నిన్నెవ్వరూ పిలువందే. ఒక్కర్తివే ఆడుదానివి మగవాళ్ళలో యెందుకు.

శే—ఆడది ఉండే అందం, ఆరుచి మీకింకా తెలియలేదు. వెళ్ళండి, వెళ్ళండి.

(భట్టుమూర్తి లేచును. నరసింహాం డాక్టర్ను అనుసరించగా

యెడమ వైపునుండి పైకిపోవుదురు. కుడిప్రక్కనుండి కమలమ్మ ప్రవేశించును.)

శే—కమలమ్మా—రా—కూర్చో. ఈమధ్య ఎప్పుడూ పరధ్యాన్నంగా ఉన్నట్టు కనపడుతున్నావు. నాతో మనస్సిచ్చి బొత్తిగా మాట్లాడ్డం మానేసేవు.

క—మీకు తెలియని విషయాలేమైనా ఉంటేగా. అందరూ నీతో ముచ్చటించేవారే. నామనో స్థితికూడా తెలిసినట్టే కనబడుతున్నావు.

శే—నామీద దేనికుకోపం. నీసుఖాన్నే యెప్పుడూ కోరేదాన్ని ఇతరులు నాతో మొరపెట్టుకుంటే నే నాపగలనా. అరటితడపని నాగుపాము జేస్తున్నారు.

క—లోకం యేదిచెయ్యడానికైనా సిద్ధమే. మాటవరస కన్నాను కాని నీమీద నాకేమీలేదు—వాత్సల్యం తప్ప. నా ఆవస్థ నీకు తెలిస్తే సానుభూతి చూపే ఉంటువు.

శే—చిన్నచిక్కులు సవరించడమే ఆడదాని ముఖ్యమైనపని. నాచేతి కొలది నేనూ చేస్తుంటాను.

క—మనోకల్పితమైన చిక్కులు పరిస్థితులే తీర్చాలి. నీ మంచి అభిప్రాయం, సహాయభూతమే.

(జగన్మోహన్ కుడిప్రక్కనుండి, డాక్టరు, నరసింహం, భట్టుమూర్తులు యెడమప్రక్కనుండియు ప్రవేశింతురు)

డా—జగన్మోహన్‌గారు కూడా వచ్చేరు.

జ—అందరకూ వందనాలు. ఆలస్యమైనందుకు క్షమించాలి. ఇంగ్లండు పోవడానికి ప్రయాణప్రయత్నంలో ఉన్నాను. ఈవేళ స్టీమరు టికట్టు వగయిరాలుకొన్నాను.

న—మీరొక్కరేనా?

డా—నరసింహాంగార్ని కూడా తీసుకువెళ్ళండి.

శే—ఆవిధంగానయినా కొంతనాగరికత అబ్బుతుంది.

భ—కూర్చోండి, కూర్చోండి. డాక్టరుగారయా టీ తీసుకొని రమ్మని చెప్పండి.

(డాక్టరు పోవును.)

శే—ఏమి యింత తొందరగా ప్రయాణం నిశ్చయించారు.

జ—విశాలమైన సముద్రం మధ్యనుంటే మనస్సుకు కొత్తవికాసం వస్తుంది. విలువైన వస్తువులు వెనకదృష్టిలో మరీ రమ్యంగా కనిపిస్తాయి. (డాక్టరు, వెనుక నౌకరు టీ పలహారములు పళ్ళెములో నుంచి తెచ్చురు. బల్లమీద నుంచబడును. డాక్టరు అందరకూ టీ పోసియిచ్చి విందుకార్యక్రమం సాగించుచుండును. పలహారం పుచ్చుకొనుచుందురు.)

డా—(నౌకరునిచూచి) నీవుపోయి యింట్లోపనులు చూచుకో. అయితే జగన్మోహన్‌గారి దర్శనం తిరిగి యెన్నాళ్ళకో.

క—ఆయన్ని సాగనంపడానికి విందివ్వకూడదా. అందరికీ సంతోషంగా ఉంటుంది.

జ—మీ అందరి వాత్సల్యం ఉంటే—అదేవిందు.

న—పలహారాల రూపంగా వాత్సల్యం బయటు పడుతుంది.

జ—ఇక్కడున్నవారంతా ప్రాణస్నేహితులే దాపరిక మనవసరం. నామనస్సును బాధిస్తూఉన్న భారం దించుకోడానికి యిదేమంచి సమయం.

న—అడక్కుండా రహస్యాలు చెప్పడం ధర్మంకాదు.

జ—నేను ధర్మం తప్పినడిచేనుకాబట్టే, మీ యందరియెదుట నాతప్పు ఒప్పుకొని సవరణ చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను.

భ—తప్పులేనివా డెవడు. మీ రంతకష్టపడడం నా కసమ్మతం.

జ—చేసినతప్పు చెపితే పోతుం దంటారు. అదీగాక మీ స్నేహం శాశ్వతంగా సంపాదించుకోవడానికి యిదే మార్గమని నాకు తోచింది. చిన్నవిషయాలైనా కప్పిపుచ్చడంవల్ల ప్రచండరూపాన్ని వహిస్తాయి. అవి లోకుల వింజ్యామరలచే చలించబడి మనస్సుని కలవరపరచి హృదయాల్ని భస్మం చేస్తాయి. అన్నిటికంటె ముఖ్యమైంది—యెవరిప్రేమ జీవితం నాకు ఆదర్శనీయంగా కనపడిందో యెవరిని అన్నివిషయాల్లో అనుకరించడానికి ప్రయత్నించానో అట్టిదంపతుల సుఖజీవితంలో, నాప్రవర్తనవల్ల దుఖం ప్రవేశించింది. అట్టిదానిని మొలకగా ఉన్నప్పుడే తృంచివెయ్యాలి.

స—మీధోరణి నా కసోపసంగా ఉంది. వేగిరం కానివ్వండి.

జ—కమలమ్మగారి ధారాళస్వభావంమూలంగా వారి స్నేహానికి పాత్రుడనై యెన్నో సుఖదినాలు గడిపేను. వారింట వింతనై రసవంతమైన వినోదాలు అనుభవించేను. ఒకనాడు, నాటకరిహార్సలు సమయాన్ని యింద్రియనిగ్రహం లేక తాత్కాలికంగా స్ఫురించిన వాంఛ ననుసరించి ఆమెను ముద్దాడ ప్రయత్నించేసి,—ఆమెకు తెలియకుండా వెనుకనుండి వెళ్ళి ఆమె కంఠాన్ని నా పెదవులతో తాకేను. ఆమెకు కోపమువస్తే మొదట నంకర సమాధానాలు చెప్పి తరువాత క్షమార్పణ వేడుకున్నాను. ఆమె ఔదార్యంవల్ల క్షమించేరు. కాని మా మచ్చికలు కొన్ని తెలుసుకొని, కొన్ని ఊహించి మన స్నేహితులు వింతవసంతులు ప్రచారం ఆరంభించేరు. మే మిద్దరంకలిసి ఇంగ్లండుకు వెళతామనే సంగతి దాన్ని మరింత బలపరిచింది. ఇవన్నీ చేరి మూర్తిగారి మనస్సు నొచ్చిం దని ఊహించేను. మూర్తిగారుకూడ నన్ను క్షమించి పూర్వంవలెనే స్నేహంగా చూడమని వేడుకుంటున్నాను.

క—ఈ చిన్నవిషయానికి మీ రింతగా నొచ్చుకొనగూడదు. ఇందు

మూలంగా నాప్రేమపరీక్షకు నిల్చిందని సంతోషస్వాంతనైతి. నాభర్తనుకూడ కొంత కష్టించి, నా ప్రేమపవిత్రతను కాపాడ్డం కొరకు, నాకు హృదయస్వేచ్ఛ నివ్వగోరి దాన్ని సమకూర్చుకొన్నాను. విశాలభావంతో ఆస్వేచ్ఛ నిచ్చుటకు అంగీకరించేరు. తిరిగి యింతలోనే మా ప్రేమ వికసిస్తుందనుకోలేదు. జగన్మోహన్‌గారి ఉదారస్వభావంవలనే యీనాటిసమ్మేళన సమకూడింది. ఆయన ఊరకుంటే యెంతకాలం పట్టియుండునో! నాకిష్టంవచ్చిన వారిని ప్రేమించడానికి నాకు హక్కు కలదని నాభర్త ఒప్పుకున్నారు. వివాహంవలనే హృదయాన్ని కట్టివెయ్యడానికి వీలులేదని ఒప్పించేను. ఇప్పుడు స్వేచ్ఛగా మనస్ఫూర్తిగా నా హృదయాన్ని నాభర్తకే తిరిగి అర్పిస్తూన్నాను. (భట్టుమూర్తివంకకు పోయి ఆతనిని కౌగలించుకొనును. అందరు లేచి నిలుతురు. నరసింహం శేషమ్మలు యెడమప్రక్కకు పోయి నిలతురు. మధ్య భట్టుమూర్తి కమలమ్మలు. కుడిప్రక్కను డాక్టరు రామమూర్తి జగన్మోహనులు).

న—మనమో (శేషమ్మను కౌగలించ ప్రయత్నించును.)

శే—(కొంచం తొలగి) ఉష్.

భ—జగన్మోహన్ వాత్సల్యంవల్లే మాకీసౌభాగ్యం లభించింది. ఎండకాలంలో శలవుపుచ్చుకొని కమలమ్మను ఇంగ్లండుకు తీసుకొనివస్తా. అక్కడ కలుసుకుందాం.

డా—మీ ప్రేమజీవితంవల్ల అందర్నీ ఆకర్షిస్తూ సుఖముండుడు.

న—తథాస్తు.